# వాణి

7 · 3 · 1962

మార్చి 16-31 కార్యక్రమాలు



విడి ప్రతి వెల 35 న.పై
ప్రతి నెలా 7,22 తేదిలు

ఆల్ ఇండియా రేడియో ప్రచురణ

వాణి

పక్షపత్రిక … … ప్రచురింపబడును.

విడిప్రతి వెల: 31 నయాపైసలు.

సంవత్సర చందా రూ. 6-50 నయాపైసలు.

సంవత్సరమునకు తక్కువ చందా అంగీకరింపబడదు.

ఇతర వివరములకు:

ఎడిటర్, 'వాణి'

ఆలిండియా రేడియో, మద్రాస్-4.





ALL INDIA RADIO




సంపుటము XIII] వాణి 7—3—1962 [సంచిక 20


# సాహిత్యంలో సంప్రదాయము - వ్యక్తిగత ప్రతిభ


డా॥ ఎన్. వి. ఆర్. కృష్ణమాచార్య


క్రొత్తదనమును కనలేక కుమిలి క్రుంగి
ప్రసవ వేదన పడుచుండె ప్రాతదనము
ఆ పురిటి నొప్పులే తెరలోపల విను
పించు జంత్రసంగీతమో పృథివి కెల్ల

ఇది నిత్య నిరంతర సాంఘిక చరిత్ర. చరిత్ర పునరావృత్తమౌతుంది - అనే సిద్ధాంతానికి అంతర్వాహినియైనది ఈ వేదాంతమే. సంఘానికి సాహిత్యానికి బింబ ప్రతిబింబభావం ఉండటంసహజం. అందుచేత వాఙ్మయ చరిత్రలో గూడ ఈ క్రొత్త పాతల మేళికలయిక—ఒక మహాకవి ఉద్భవానికీ ఒక నవయుగోదయానికీ—తొలి ఉషస్సులు కల్పిస్తూ ఉంటుంది. కాల ప్రవాహం నిరంతరంగా సాగిపోతున్నప్పుడు కొట్టుకొని పోకుండా నిలిచివుండే స్ఫటిక శిలలే సంప్రదాయాలు. ఈ సంప్రదాయాలమీద ప్రాతదనం తన ముద్ర వేస్తుంది. ఇవి చాలకాలం నాణేలకింద్ర చలామణీ ఔతుంటాయి. కొన్ని బంగారు నాణేలు. కొన్ని ఇత్తడి నాణేలు. కొన్ని కేవలం కాగితపునోట్లు. వీటికి స్వతస్సిద్ధమైన విలువ ఏమీ లేకపోయినా, కారణాంతరములవల్ల చలామణీలో వుంటాయి. అల్లాగే సాహిత్యంలోగూడా ఎన్నో సంప్రదాయాలు యుగయుగాలనుండీ ఏర్పడుతూ వుంటాయి. ఇవి ఆదిలో ప్రతిభావంతులైన ఏ మహాకవివల్లనో ప్రభావాన్ని సంపాదించుకొని, అధికార ముద్రతో ప్రభుత్వం నెరపుతూవుంటాయి. అయితే ఈ ప్రాత సంప్రదాయాలను అధిగమించి క్రొత్త సంప్రదాయాలను సృష్టించి చలామణీలోకి వచ్చేటట్లు చేయగల మహాకవులు చాల అరుదుగా ఉద్భవిస్తూవుంటారు. వారే వ్యక్తిగత ప్రతిభావంతులు.

## ప్రాణప్రదమైనటువంటిది ప్రతిభే

ప్రతిభ అనే మాటను సంస్కృతాలంకారికులు మనోజ్ఞంగా నిర్వచించారు. నవనవోన్మేష శాలినీ ప్రజ్ఞా ప్రతిభా—అప్పటికప్పుడు సద్యస్స్ఫూర్తితో వికసించగల ప్రజ్ఞకు ప్రతిభ అని పేరు. సంప్రదాయానికి ప్రాతదనం విలువనిచ్చినట్లు ప్రతిభకు క్రొత్తదనం ప్రాణప్రతిష్ఠ చేకూరుస్తుంది. అభూత పూర్వకమైన కల్పనాశక్తి ప్రతిభ. ఈ ప్రతిభకు సమయస్ఫూర్తి, యుటితస్ఫూర్తి వైలక్షణ్యాన్ని చేకూరుస్తాయి. ప్రతిభకుగల ఇంకో లక్షణం—అది స్వభావసిద్ధంగా సహజంగా అలవడవలసిన ప్రజ్ఞేగాని—అభ్యాసవశాన సాధ్యపడే విద్య కాకపోవటం. మన ప్రాచీనులు కవితా హేతువులుగా చెప్పిన అంశాలు మూడు. ఒకటి ప్రతిభ, రెండవది వ్యుత్పత్తి, మూడవదీ అభ్యాసము. సిద్ధహస్తత సాధించవలెనంటే అభ్యాసం అవసరమని అందరూ అంగీకరిస్తారు. శిక్ష కవిత్వానికి పాండిత్యమవసరమా అంటే—పాండిత్యం లేకపోతే కవిత్వం రాణించదని అంగీకరించక తప్పదు. కాని కవిత్వానికి ప్రాణప్రదమైనటువంటిది ప్రతిభే. అందుచేత ప్రపంచంలో పుట్టుకవులుండాలిగాని, పెట్టుకవులుండటానికి వీలులేదను ఆంగ్ల సుభాషితమిటు అనుసంధేయం 'పొయట్స్

ఈ సంచికలో

ముఖచిత్రం: కూచిపూడి నాట్య భంగిమ

(మార్చి 17-వ తేదీ రాత్రి 7-30 గంటలకు హైదరాబాద్ కేంద్రమునుండి కూచిపూడి నాట్యమేళ' కదంబ కార్యక్రమం వినవచ్చు)

ఆర్ బోర్న్ అండ్ నాట్ మేడ్'. ప్రతిభ
అయితే ప్రతిభ అనేది ఒకవిధం
గా అనిర్వచనీయమైన ప్రజ్ఞ.
అంతేగాక ప్రతిభ బహుముఖమై
ఒక్కొక్కరిలో ఒక్కొక్క ప్రజ్ఞ
వుంటుంది. ఈ విషయాన్నే
భంగ్యంతరంలో తెలిపే చిరస్మ
రణీయమైన సుభాషితం, "ముఖే
ముఖే సరస్వతీ" ఈ దృష్టితో
చూచినట్లయితే మన ఆంధ్రవాఙ్మ
యంలో సంప్రదాయాలు ఏవిధం
గా ఏర్పడినదీ— వ్యక్తిగతమైన
టువంటి ప్రతిభతో ఏయే మహా
కవులు ఏయే విన్నూత సంప్ర
దాయాల్ని నెలకొల్పినదీ— అను
శీలించదగిన విషయం.

సాహిత్యంలో భాషకుసంబం
ధించిన సంప్రదాయాలు —
అలంకారాలకు సంబంధించిన
సంప్రదాయాలు — ఛందస్సుకు
సంబంధించిన సంప్రదాయాలు—
మాత్రమేగాక భావనలు భావాలు
ఇతివృత్తాలు, పాత్రలు మొద
లైన ఎన్నో అంశాలను గూర్చి
సంప్రదాయాలు ఏర్పడుతూనే
వుంటాయి. ఈ సంప్రదాయాలను
సామాన్యులు ఉల్లంఘించలేరు.
వ్యక్తిగతమైన ప్రతిభావంతులు
మాత్రము క్రొత్తసంప్రదాయాల్ని
సృష్టించి తరువాతి తరాలవారికి
ఒజ్జబంతులు ప్రసాదించగలుగు
తారు. అంటే నిజమైన వ్యక్తిగత

రెండు ముఖ్య లక్ష్య
బొడ్డుంటాయి. విసకునుంచు
వారిని తాను అనుసరించకపోవ
టం, తన తరువాతి వారు తన్ను
అనుసరించటం. అయితే సంప్ర
దాయాన్ని పూర్తిగా నిరసించడ
మని దీనికి అర్థం చెప్పుకోగూడ
దు. పునాదిలేకుండా ఇల్లుకట్టడం
ఏవిధంగా అసాధ్యమో సంప్ర
దాయాల్ని పూర్తిగా విడిచిపెట్ట
టంగూడ సాధ్యంగాదు—అభిల
షణీయం అంతకంటేగాదు.

ఊసరక్షేత్రాలు - సస్యశ్యామలం

ఆంధ్రవాఙ్మయంలో వ్యక్తి
గత ప్రతిభచే చాలమంది
ప్రాచీన సంప్రదాయాలని అధిగ
మించి క్రొత్తపుంతలుత్రొక్కిన
మహాకవులెందరో వున్నారు
నన్నయభట్టుకు పూర్వమే తెలు
గులో ఎందరో శాసనకవులు
వర్ధిల్లియున్నారు. నన్నెచోడ
మహాకవి మాటల్లో చెప్పాలంటే

మును మార్గకవితలోకం
బున వెలయగ దేశికవిత
పుట్టించి తెలుం
గున నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు
మొదలుగ పలువుర్.

పలువురు ప్రతిభావంతులు
చేరి మార్గకవితకు మాత్రమేగల
రాజగౌరవము సభాపూజ్యత దేశి
కవితకుగూడ కల్పించినారు—





ఆ చాళుక్య ప్రభువులకాలములో.
కాని అజ్ఞాత యుగమున వ్యక్తి
గత ప్రతిభతో ఎవరు ఏ ప్రాచీన
సంప్రదాయాల ధిక్కరించిరో
ఎవరు ఏయే క్రొత్త సంప్రదా
యాలను నిర్మించిరో ఆంధ్ర
వాఙ్మయ చరిత్రకు అందని
విషయం. ఈ అజ్ఞాత కవులలో
చివరి వాడుగ ఆంధ్రవాఙ్మయం
లో ఆదికవిగ పేర్కొనదగిన
వాడు నన్నయభట్టు. కొంతటి సచే

తన కవి గాధలు త్రవ్వి తెలుం
గువారికి ఆంధ్ర వాఙ్మయమున
ప్రథమ కావ్యమూ ప్రధాన
కావ్యమూ అని చెప్పదగిన మహా
భారతమును సృష్టించిన ప్రతిభా
వంతుడు నన్నయ. తెనుగు
దేశమున నన్నయకు 'పూర్వము
సాహిత్యభాషగా వున్నది ప్రా
కృతము. నన్నయకు పూర్వము
గుణాఢ్యుని బృహత్కథ, హాలుని

(తరువాయి 46వ పేజీలో)

# పుస్తక పరిచయము

టి. వి. సీతారామారావు

## గగనకుసుమాలు

రచయిత: హరికిషన్

ఒక మధ్యతరగతి కుటుంబములో వ్యక్తులందరు వేరు వేరు మనస్తత్వాలు కలిగి, జీవితంలో పొందిన కష్టసుఖాల అనుభవాలు వాస్తవిక దృష్టిలో చిత్రీకరించినవి ఇది మధ్యతరగతి జీవితపు కుటుంబ గాథ. ఇందులో తక్కువ జీతంలో ఇద్దరు కూతుళ్ళ చదువులు, పెళ్ళిళ్ళ సమస్యలు తట్టుకోలేక పిత్రార్జితమైన ఒక్క ఇంటిని అమ్ముకొనిన స్కూలు మేష్టరు వెంకట్రామయ్య. ఆడపిల్లలకు చదువు అవసరం లేదనీ. పెళ్ళిళ్లు చేయాలనీ, ఉబలాటంతో, అవధులు దాటిన మాతృప్రేమతో సంసారాన్ని కష్టాలపాలు చేసుకున్న ఆయన భార్య, ఒకేసారి కవలలుగ పుట్టి ఒకేసారి స్కూల్ ఫైనల్ ప్యాసై, వేరు వేరు ఆశయాలతో, కోరికలతో భిన్న మార్గాలు అనుసరించిన సావిత్రి, రుక్మిణి. ఉన్నత విద్యావంతుడై స్వతంత్రంగా జీవిస్తూ, దాంపత్య జీవితంలో కాలుబెట్టి తల్లిమీద ప్రేమతో భార్యను తీవ్రమైన వ్యథకు పాల్జేసిన రామారావు. సంపన్న గృహంలో పుట్టి మొగ్గవిడిచిన యవ్వనారంభంలో ప్రణయ కలాపంలో వ్యగ్రోత్సాహియై బాధను తట్టుకోలేక, స్త్రీ హృదయాన్ని గుర్తించాలనే పందెములో ఒడుదుడుకులకు గురియైన మురహరి, తొలిప్రేమలో పరాజయాన్ని అందుకుని తప్పటడుగులతో కీర్తిగమ్యాన్ని చేరుకొనిన సాగరేశ్వరి యిందులో ప్రధాన పాత్రలు సజీవ పాత్రలతో, వాస్తవిక సన్నివేశాలతో, భిన్నమానసిక సంఘర్షణలతో, పాఠకుల ఆసక్తిని యినుమడింపజేస్తూ కథాకథనం సాగింది.

ప్రేమ, స్నేహము అనే పదాలకు రుక్మిణి, సాగరేశ్వరి అనే పాత్రల చేత పలికించిన నిర్వచనాలు, ఆయా ఘట్టములలో వారి మానసిక స్థితిని వివరించటానికి, రుక్మిణి భావి జీవితంలో, రచయిత కల్పించదలచుకొనిన పరిణామానికి తోడ్పడినవే గాని, ఆ పదములలోని ఉదాత్త భావములు సఫలితం గాలేదు సంభాషణలు భావస్ఫూర్తికి అనుగుణమైన స్థాయినందుకోలేదు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రారంభమైన యీ కథ పది సంవత్సరాలకు 1957 నాటికి ముగుస్తుంది ఈ కథాకథనములో రచయిత పేర్కొనిన సంవత్సరముల క్రమం. అందు సావిత్రి కాపురానికి వెళ్లడం, రేషనింగు, వెంకట్రామయ్య స్కూల్ మేష్టరు ఉద్యోగంనుంచి రిటైరు కావటం, మొదలైన అంశాలు పాఠకులకు ఏ విధంగాను ఆసక్తి కలిగించేవి గావు. ఇవి కథాపుష్టికి తోడ్పడనవిగావు. ప్రపంచ యుద్ధకారణంగా జీవితావసర వస్తువుల ధరలు పెరగటం, వెంకట్రామయ్య వంటి సామాన్య గృహస్థుల కుటుంబ ఆర్థిక పరిస్థితులు క్లిష్టతరం గావటం, అప్పటి ప్రజా జీవితాలలో ఏర్పడిన దయనీయ పరిస్థితులు. ధనవంతులు యుద్ధావసరముల కొరకు ప్రభుత్వానికి విరాళములిచ్చి బిరుదులకోసం తాపత్రయపడటం అతి సహజంగా చిత్రీకరించబడినవి. వేగోద్ధృతిగల యీ కథాకథనంలో పాఠకులను పరిణామములు ఆకర్షించినటుగా సంభాషణలోని భాష ఆకర్షించడంలేదు కాని యీ కథలోని పాత్రల జీవితానుభవాలు, సుఖదుఃఖాలు, ఆశయాలు కోరికలు. వాటి పరిణామాలు, వాస్తవికజీవితంలో కొంతమందికైనా ఆత్మ పరిశీలనానికి అవకాశం కలిగిస్తవి. నిత్యజీవితంలో ఇలాంటి అనుభూతులు పొందినవాళ్ళుకూడా సాక్షాత్కరిస్తూ ఉంటారు. నిశిత పరిశీలనా దృష్టి, కథాశిల్పములో నైపుణి భావస్ఫూర్తి కలిగిన ఈ రచయిత కృషి పాఠకులను లెస్సగ నాకర్షించగలదు.

## ఝాన్సీరాణి

రచన: సున్నం వీరరాజకవి

లక్ష్మీబాయి ఝాన్సీరాణి. ఈమె జీవితగాథ ఇది. భారతదేశ స్వాతంత్ర్య సమర చరిత్రలో యిది ఒక ఉజ్జ్వల ఘట్టము. స్వాతంత్ర్యము మానవ జన్మహక్కు అనే సత్యమును భారత ప్రజలకు నిరూపించిన ప్రథమ వీర రమణి ఈమె. ప్రథమ భారత స్వాతంత్ర్య రణరంగమునందు యీమె వీర విహారము సల్పి, శత్రుసైన్యములను చీకాకుపరచి, కదనరంగమునందు ప్రాణములర్పించి వీర స్వర్గమలంకరించినది. లక్ష్మీబాయి జీవితగాథను ఇతివృత్తముగా స్వీకరించి శ్రీ సున్నం వీరరాజకవి యీ పద్య కావ్యమును సంతరించినారు. రచయిత యీ కథాకథనమందొక నూతన మార్గమును అనుసరించినారు. ఈ కావ్యమునందు కథాంశము ఆమెకే జెప్పబడినది, శైలి లలితమై మృదుపద శోభితమైనది. కవితా సారళ్యమునకు యీ పద్యమును పరికించవచ్చును.

కరవాలమునన్ వైరిశిరములు
దూదిపిం
జలవలె రాల్చు భుజాబలంబు,

సంగ్రామరంగాన శత్రుశీర్షాలతో
బంతియాడెడు పద బలంబు,

క్షణములో రిపుల కంటను కార
ముగొట్టి
తప్పించుకొనెడు మేధా
బలంబు

పరిపంథిన గటిమి బట్టి పల్లార్చు
సారెకు బోరు శరీర బలము

కాలగర్భాన కలిసెనుగాని. భార
తీయుల హృదంతరముల
త్వదీయ నిరుప
మాన జీవిత ఘట్టాలు పావనకర వి
తారకముగాగ నిలిచెడు వీరమాత

ఆంగ్లేయులు బుందేల్ ఖండ్ ను ఆక్రమించటానికి అనేక కుట్రలు పన్నారు. అప్పుడు జరిగిన దారుణ దురంతములను అత్యంత దయనీయముగ వర్ణించినారు. దేశభక్తి ప్రపూ

రితమై, వీరకరుణారసములతో ప్రభావితమైన యీ కావ్యము శ్రీ తెన్నేటి విశ్వనాధంగారికి అంకితమివ్వబడింది. మధుర కవితావిలసితులైన యీ కవి లేఖినినుండి దేశభక్తుల మహిమాన్విత జీవితగాథా సందేశములు, భవిష్యత్కాలంలో యింకా వెలువడగలవని ఆశించవచ్చును.

### తాతా మనుమడు

రచయిత : పల్లభనేని కాశీవిశ్వనాధం

ఇటీవలి కాలంలో పెద్దలుగూడ బాలసాహిత్య సృష్టిపట్ల శ్రద్ధావహులగుట యీ సాహిత్య ప్రక్రియ యొక్క పురోభివృద్ధికి ఒక శుభసూచన. శ్రీయుతులు గిడుగు వేంకట సీతాపతి, నేదునూరి గంగాధరం, దాశరధి ప్రభృతులు యీ సాహిత్యాభివృద్ధికి కృషి చేస్తున్నవారిలో కొందరు. ఛందోతిక్రమణమే యీ సాహిత్యాభివృద్ధికి మార్గము కాజాలదు. బాలబాలికల వయఃపరిమితికి గ్రాహ్యముగాని ఉదాత్తభావ ప్రకర్షగూడా యీ సాహిత్యముయొక్క సమగ్ర స్వరూప చిత్రమునకు దోహదపడజాలదు.

తాతామనుమడు, సంభాషణ రూపంలో వెలువడిన గేయం ఇందులో ఉపయోగించిన ఛందస్సు ముత్యాలసరాలు. వయోవృద్ధుడైన తాత తన మనుమడికి ఒక మహోదయకాల పరిమితిలో దేశంలో జరిగిన విప్లవ గాథ చెపుతాడు.

అంకతలమున చంక క్రిందను
బొంకమున గూర్చుండె మను
మడు....

ఇలాంటి వయస్సులోని మనుమడు తాతతో యీవిధంగా మాట్లాడుతాడు,

అంధకారం ఆవరించెన
ముందులోకం బంధకాత్మకు
దుర్గమంబా త్రోవ తాతా.
.... .... ....
బ్రతుకుగాకను చావుగాకను
చావు బ్రతుకుల సమరమందున
సతమతంబై పోతె తాతా?

తాత చంక క్రింద కూర్చునే వయస్సులోని మనుమడు ...ముందు లోకం బంధకాత్మకు, దుర్గమంబా త్రోవ .... అని చెప్పగల జ్ఞాన స,

[తరువాయి 10వ పుటలో]



# తీరని కోరిక

ఎ. పిచ్చేశ్వరరావు

నా పసుపూ కుంకుమా చల్లగా వుండి, ఆయనగా రుండగానే, నే నిట్లాగే కళ్ళుమూస్తే అంతేచాలు, ఆడదాని కంతకంటే అదృష్టం యింకేమి కావాలే ...అనేది మా అమ్మమ్మ.

అదే ఆవిడ ఆఖరి కోరిక. ఆ కోరిక ప్రకారమే కాలం వెళ్ళమార్చుకుని వెళ్ళిపోయిందావిడ. మా అమ్మమ్మ నిజంగానే అదృష్టవంతురాలు.

అంతే...

మా తాతయ్య బ్రతికుండగానే చనిపోయింది కాబట్టనికాదు. మా అమ్మమ్మ మనసారా నమ్మి నోరారా చెప్పిన కోరిక అదొక్కటే కాబట్టి, ఆ కోరిక నెరవేర్చుకుని మరీ కాలధర్మం చేసింది కాబట్టి.

కాలధర్మం అంటే గుర్తుకొచ్చింది ఏ కాలానికా కాలాని కొక ధర్మం వుంటుంది ఒక కాలానికదధర్మం వైంది, యింకో కాలానికి ధర్మం కావచ్చు గదా. అందుకనేనేమో, నా కోరికల్ని తలచుకున్నప్పుడల్లా మా అమ్మమ్మ గుర్తుకొస్తుంది. కోరికలు లేని కాలమంటూ కాలం వొకటుంది. ఆ కాలం యీ మామూలు కాలాలాంటిది కాకపోవచ్చుగాక. అది కాలమే కాదని కొందరంటే అంటారు గాక.

కోరికల్ని జయించడం మంచిదని అన్నవాళ్ళున్నారు. కోరికలు శత్రువులనుకుని ఋణశేషమూ శత్రుశేషమూ వుంచరాదని అన్నవాళ్ళు వాళ్ళు.

కాని ఇక్కడే వున్నదొక కిటుకు. శత్రుశేషం వుంచని వీరులు చాలమందున్నారు. ఆ చాలమంది చరిత్రలో, తాత్కాలికంగా ఒక పుటనో, అధ్యాయాన్నో ఆక్రమించుకుని విర్రవీగిరవారు, ఐతే అజాత శత్రువులున్నారే, ఆ అజాత శత్రువులు ఆచంద్రతారార్కం నిలబడినా నిలబడకపోయినా, నిలబడే అవకాశం వున్నదని అప్పుడప్పుడూ మన కనిపిస్తుందే. వుంటూనే వున్నట్లు మన కనిపిస్తూనే వుంది.

ఇందులో ఎవరు గొప్ప—శత్రుశేషం వుంచని వీరులా. అజాత శత్రువులా, కోరికలు జయించినవారా? కోరికలు లేనివారా?

ఈ ప్రశ్నలు నేను పుట్టి బుద్ధెరిగిన తర్వాత చాలాసార్లు వేసుకున్నాను. సమాధానం తేలిగా చేతికి చిక్కలేదు. నేను చిక్కుల్లో పడ్డాను. చిక్కులో చిక్కుకున్న చిక్కులో బడి ఉక్కిరిబిక్కిరై పోయాను. చిక్కిపోయాను శారీరకంగాకాదు, ఆ చిక్కులో.

అడిగేవాడికి చెప్పేవాడు లోకువని మనందరం ఒప్పుకుంటాం. ఆ గొప్పదనం అడిగేవాడిలో లేదు. వాడడిగే ప్రశ్నలో వుంది. ఆ మాటకొస్తే, వాడడిగే ప్రశ్నలోనే కాదు. ప్రతి ప్రశ్నలోనూ వుంది.

అందుకనే ఈ ప్రపంచం ఒక పెద్ద ప్రశ్నార్థకము... అంటే బహుగొప్పదన్నమాట.

ఎంత గొప్పది కాకపోతే, ఏ కోరికలూ లేనికాలంలోంచి, కోరికలెన్నో వున్న కాలములోకి దొరుకొస్తుంది? ఇది పురోగమనమా? తిరోగమనమా? ఏ గమనమైనా గమనం మాత్రం ఔను కదా.

ఈ గమనంలో మనం వున్నాం గదా. అదీ అసలు విషయం. నేను వున్నాను. మీరున్నారు....మనము వున్నాం. వున్నాం కనకనే నేననేవన్నీ మీరనకపోయినా వింటున్నారు. మీరు వినాలనే నా కోరిక.

నా కోరికలన్నింటిలాగే, యీ కోరికా కరిమింగిన వెలగపండైతే.... అని నా సందేహం ఎందుకంటే, నాకు సందేహాలెక్కువ. ఆ సందేహాల్లోంచే కోరికలు పుట్టుకొచ్చినై నాకు.

ఆ మాటే ఒకసారి నేను మా వారితో అన్నాను. వారేమన్నారో తెలుసా? దేహం వున్నంతకాలం యీ సందేహాలు తప్పవన్నారు. ఐతే, కోరికలూ తప్పవుగదా అన్నాను.

కోరికలంటే మనమనుకునే దాన్నిబట్టి వుంటుంది....అన్నారు వారు.

కోరికల్లో గూడా తెగలూ, తరగతులూ వున్నవా అన్న సందేహం అప్పటిగాని కలగలేదు నాకు. కోరికలలో తెగలూ తరగతులూ తప్పించుకోలేనివాళ్ళం తరగతులూ, తెగలూ లేని సమాజాన్నెలా సృష్టించగలమా? అన్న సందేహం కలిగింది.

పోనీ,

తెగలూ తరగతులూ లేని సమాజాన్ని సృష్టించుకున్నాము. కోరికల్లో తెగలూ, తరగతులూ లేకుండానైనా పోతాయా అని యింకో సందేహం వచ్చింది.

నాకింకే కోరికాలేదు ఈ ఒక్క సందేహం తీర్చండి అని అడిగాను మా వారిని.

చచ్చాం....అన్నారాయన అంటూనే పగలబడి నవ్వారు.

చావులో అంత ఆనందం వుంటుంది కాబోలు. అనుకున్నాన్నేను, అమాయకంగానే. అప్పుడుగాని మా అమ్మమ్మ అమాయికత్వం నా కర్థం కాలేదు.

మా అమ్మమ్మ కోరుకున్నది అంతే, చావులో సుఖాన్ని.

ఎంత స్వార్థం.

అప్పటికి మా అమ్మమ్మింకా చనిపోలేదు. అమ్మమ్మా, అమ్మమ్మా, తాతయ్యకంటే ముందు నువ్వు చనిపోతే, తాతయ్య కిబ్బందికాదూ? అనడిగేవాను. అడిగేవానేగాని అడగ్గానే నాలుక్కరుచుకున్నాను.

చావుకంటే బ్రతుకు గొప్పదనే అయ్యుండాలి మా అమ్మమ్మ ఉద్దేశం.

ఆగొప్పదనం మా తాతయ్యకు దక్కాలనే అయ్యుండాలి ఆవిడ కోరిక. అంత గొప్ప బ్రతుకును తాతయ్యకప్పగించి. నిస్వార్థంగా తాను కళ్ళుమూసుకోవడమే, తాతయ్యంటే తన కున్న ప్రేమకు తార్కాణం అనుకుని వుండాలి మా అమ్మమ్మ....

కాబట్టి, అమ్మమ్మ చచ్చిపోయి సుఖపడదామని కాదు అనుకుంది. బ్రతుకులో వున్న సుఖాన్ని కాదను

కోవడమే గొప్ప అనుకుంది తాతయ్యకంటే ఎక్కువకాలం బ్రతికి తాతయ్యంటే వున్న బంధాన్ని తెంచుకోలేక బాధ. దేనంటే తనకు తెలియకుండా ఆ బంధం తెగిపోతేనే మంచి దనుకుంది.

ఇదింకా గమ్మత్తుగా వుందనిపించింది

ఐతే, అమ్మమ్మ వద్దనుకున్నది బ్రతుకులో వున్న సుఖాన్నికాదు, తీయదనాన్నికాదు, తాతయ్యకంటే ఎక్కువకాలం బ్రతికితే, బ్రతుకులో రుచి చూడవలసివచ్చే చేదుని

ఇదంతా ఆలోచించుకుంటూ కూర్చుంటే ఎంతో ఆశ్చర్యం వేసింది. ఆ ఆశ్చర్యాన్ని దాచుకోలేక, అమ్మమ్మ మొహం తేరిపారజూశాన్నేను.

అదేవిటే, నా మొహంవంక అదే పనిగా అల్లా చూస్తావ్? నా మొహాన్నేమైనా కోతులాడుతున్నయ్యా? అని నవ్వేసింది.

అడిగితే మావారు నవ్వారు.

అడిగి, నాలుక్కరచుకుని, ఆలోచించుకుంటూంటే మా అమ్మమ్మ నవ్వింది.

ఐనా నాకు నవ్వు రాలేదు.

మా అమ్మమ్మ అన్న కోతులు గుర్తుకొచ్చినై.

కోతులక్కూడా కోరిక లుంటాయా?

అన్నట్టు మానవజాతికీ వానరజాతికీ మూలజాతి ఒక్కటే అని కదూ అంటారు శాస్త్రవేత్తలు.

వానరుల్లో మానవత్వం ఎక్కువా?

నరుల్లో వానరత్వం ఎక్కువా?

మనలో కోరికలు ఆ వానరత్వానికి చిహ్నమా?

మానవత్వానికి చిహ్నమా?

ఈ ప్రశ్న నేను కాలేజీలో చదువుకొనేప్పుడొక లెక్చరర్‌గారి నడిగాను.

రెంటికీని.... అని నవ్వేశారాయన.

క్లాసంతా పగలబడి నవ్వారు. చిన్నప్పుడు నేను ఒంటరితనంతో బతికినప్పుడు చూసి నవ్వుల పిల్లల్లాగా.

నాకు నవ్వు రాలేదు. కాని సిగ్గేసింది.

అనాటి సిగ్గు యీనాటికీ వదల్లేదు నన్ను.

స్త్రీకి సిగ్గు పెట్టని ఆభరణంలాంటిదని అంటారు కదా అని సరిపుచ్చుకున్నానుగాని, ఆనాడు వేసిన ప్రశ్నకీనాటికి సమాధానం దొరకలేదు నాకు.

దొరకదుగదా అని వూరుకోలేదు నేను. మా అమ్మమ్మ నడిగాను.

చదవేస్తే వున్నమతిగూడా పోయిందనీ .. ఏంమ్మాటలవి? అని కూర్చున్నచోటునుంచి చివాలున లేచెళ్ళిపోయింది

నిజమే అనిపించింది నాకు. చదువుకోకుండా వుంటేనే బాగుండేదేమో అనిపించింది, నిజం చెప్పొద్దూ?

ఈ నిజం చెప్పాలన్న మాటగూడా నాకా చదువే నేర్పింది. అందుకనే నేమో, నిజానికి రోజులు కావనే వాళ్ళు చదువుకంటే బ్రతుకు గొప్పదని అంటారు. చదువు చెప్పలేని అనుభవం జీవితం చెప్పుతుందంటారు. నిజానికి చదువుకూ బ్రతుక్కూ అంతదూరం వుందా?

బ్రతుక్కూ సమన్వయం చదువు నేర్పుతుందా? చదువుకు దండన్యాయం బ్రతుకు నేర్పుతుందా?

వారిజాక్షులందు, వైవాహికము లందు, ప్రాణవిత్తమానభంగమందు బొంకవచ్చు నధిప....అన్నాడు బ్రతుకు తెరువు ఉపదేశించిన గురువు బలిచక్రవర్తితో. కాని, అదీ మనం చదువుకున్నదేనే

ఈ సందేహానికి సమాధానం మా వారు చెప్పారు.

పిచ్చిదద్దమ్మా చదువంటే గతం బ్రతుకంటే ప్రస్తుతం....అన్నారు.

ప్రస్తుతాన్ని మనం చదువుకోలేమా? అనడిగాన్నేను.

నువ్వుచేస్తున్న పనదేగా....అన్నారు వారు.

అదేవంటే, కోరికల్లోలాగానే చదువుల్లోనూ తెగలూ తరగతులూ వున్నాయన్నారు. అవి వూరుకుంటే [illegible]నే వాదేది, మళ్ళీ నవ్వారు.

ఇక వూరుకుండలేక, నవ్వితే నాన చేనే వండుతుందిలే....అన్నాను.

అది నువ్వు చదువుకున్న మాట కాదు....అన్నారు.

ఔను. చదువుకున్నదే అమ్మమ్మ చెప్పిన చదువు....అన్నాను.

అర్థంకాని చదువది అన్నారు.

నాకోపం వచ్చింది, అమ్మమ్మనర్థం చేసుకోలేకపోయానే నేనని. కాని, వెంటనే తమాయించుకున్నాను. మా వారు ద్వంద్వార్థంగా మాట్లాడారని తెలిసిందాన్ని కాబట్టి, మాట్లాడారేమో నని సంశయించి.

ఆ చదువుకో డబ్బు చేసుకోలేమేమోగాని, బ్రతుకు బాగుచేసుకోగలం అన్నాన్నేను నా తెలివికి నేనే సంకోచిస్తూ

అదేవిటి? అన్నారు వారు.

అర్థంకాని చదువంటే మీ ఉద్దేశం అదేగా.........అన్నాన్నేను. ఈసారి తప్పించుకోలేరు చూద్దాం అంటూన్న ద్వంద్వం కాకుండా.

ఐతే, అర్థంలేని చదువు అన్నారు వారు. యీసా రమాయకంగా.

అన్నా అదే అర్థం అన్నాన్నేను వెనుకంజ వెయ్యకుండా.

ఐతే, నావచేనంటే అర్థము ఏమిటో చెప్పు అన్నారు వారు.

అది ప్రశ్నకాదు. ఆ ప్రశ్నలోనే నువ్వు చెప్పలేవన్న అర్థం స్ఫురించింది.

ఆ అర్థాన్ని పట్టించుకోనటు నటించాన్నేను. అర్థానికున్న అసలు అర్థం పోయి డబ్బు అన్న అర్థం ఎప్పట్నుంచొచ్చింది? ఎందుకొచ్చింది? అని ఆలోచనలో పడ్డాను.

నావచేనకూ, నావసాటికి అర్థ సామ్యం వున్నదా అన్న ఆలోచనలో పడ్డాను.

మనిషికి లోచనాలు ముఖ్యమా, ఆలోచనలు ముఖ్యమా అన్న ఆలోచనలో పడ్డాను.

నా ఆలోచన మావారికి మగత నిద్రలా కనిపించింది. ఆయన గాఢ నిద్రపోయారు.

ఇక నా జీవితం యింతేనా? అర్థం పర్థంలేని ఆలోచనల్తో అర్ధరాత్రి వరకూ నిద్రపోకుండా వుండడమేనా?

[తరువాయి 52వ పుటలో]

# ఆంధ్రదేశములో పురావస్తుస్థానములు: గుంటుపల్లి

రాళ్ళబండి సుబ్బారావు

ప్రశ్న: ఆంధ్ర ప్రదేశములోని పురావస్తుస్థానములలో గుంటుపల్లి ఒకటి. అందలి విశేషములు గురించి తెలియజెప్పవలెను....

జవాబు: పశ్చిమ గోదావరిజిల్లా ముఖ్యపట్టణమగు ఏలూరుకు ఆరుమైళ్ళ తూర్పునయున్న, ఒకప్పుడు వేంగి రాజ్యమునకు రాజధానియైన వేంగిపురము కలదు. దానికి ఎనిమిది మైళ్ళ దూరమున తూర్పుగా రోడ్డుమీద కామవరపుకోట అను పట్టణం కలదు. దానికి ఆరుమైళ్ళ దూరమున ఈశాన్య దిక్కుగా గుంటుపల్లి గ్రామము కలదు. దీనినే యిప్పుడు జీలకర్ర గూడెము అని పిలుతురు. ఇది ఒకప్పుడు జమీందారీ గ్రామము. ఆ గ్రామమునకు ఒక మైలుదూరమున తూర్పు పడమరగా ఒకకొండ గలదు. ఆకొండ దొలిచి నిర్మించిన అనేకస్థూపములు చైత్యాలయములు, బౌద్ధమఠములు క్రీస్తుకు పూర్వం మూడవ శతాబ్దియందు ఆంధ్ర శాతవాహన రాజులు కట్టించిరి. యీ కొండలో నిర్మించిన గుహలు సాయంకాలమందు చూచిన సూర్యకిరణముల ప్రసారములతో నిండి, వెల్తురు గల్గిన ఒక పెద్ద అంతస్థులోని గదులవలె కనబడును.

ప్ర: ఇక్కడ నిర్మించిన ప్రాచీన కట్టడములు అవి నిర్మించుటకు కారణములు, అవి ఏ ప్రకారము నిర్మించినది తెలియజెప్పవలెను.

జ: గుంటుపల్లి క్షేత్రమున బహు ప్రాచీనమైన కట్టడములు గలవున ఇవి అశోకుని కాలమునాటి వనిస్నీ. అందు దొరికిన పాత్రి, ప్రాకృతశాసనములనబట్టియు కట్టడముల శైలినిబట్టియు తెలియును. గుంటుపల్లి కొండ పశ్చిమభాగమున గుండ్రని చైత్యమండప మొకటిగలదు. యీ గుహచైత్యము బహు ప్రాచీనమైనది. మంచి అందమైన కట్టడము, దానికి ముందు ఒక దాబాయును, అందుండి పైనున్న బౌద్ధమఠమునకు మార్గమును గలవు. యీ మఠమున అనేక చిన్న రాతి గుహలు కలవు. యీ బౌద్ధమఠములేక విహారమునకు ముందొక దాబా, దాని కుత్తరంగా కొండపైని మరియొక గుహా విహారమును, దాని చెంతను కొన్ని ఇటికస్థూపములు, ఒక చైత్యము కలవు. వాటి సమీపమున ఒకపెద్ద మండపం కలదు. చేరువనున్న స్థూపములలో ఒక రాతిస్థూపమునందు బుద్ధుని స్మారకచిహ్నములుగల పెట్టె దొరికెను....

బౌద్ధస్థూపములు అప్పటికాలపు బుద్ధుని విగ్రహములు, పూజా ద్రవ్యములు, శిల్పకళకట్టడపు పనివాడితనము తెలియజేయుచున్నవి. బుద్ధుని పరినిర్వాణానంతరము దహనముచేయగా మిగిలిన ఎముకముక్కలు భస్మము మొదలగునవి సంచయనము ప్రోగుచేసి వాటిని దేశములోని వివిధభాగములకు పంచిపెట్టగా ఆ పవిత్రశేషములు ఒకగాజు భరిణయందుగాని, రాతి భరిణయందుగాని ఉంచి వాటిపైని మట్టిదిబ్బచేసి అది వర్షకాలములో కరిగిపోకుండా శిలాఫలకములు దానిచుట్టును అమర్చి వాటిపైని బుద్ధుని జీవితచరిత్రకును అంతకుముందు జీవితములోని విశేషములను గ్రహించి శిల్పులవల్ల అందముగా చెక్కించుచుండిరి. దీనికే స్థూపము అనిపేరు. దీనికే దగోబ, ధాతుగర్భ యనియు, చితివల్ల వచ్చినది గాన చైత్యమనియు ప్రజలు వాడుకగా పిలుచుచుండిరి. బుద్ధుడే ఇట్టి నిర్మాణము కట్టుటకు ప్రోత్సహించెను. శారీరక ఉద్దేశిక అను రెండు రకముల స్థూపములు ఆంధ్రదేశమందు గలవు. గుంటుపల్లి స్థూపములలో దొరికిన శేషములు ఇట్టివే. ప్రతిస్థూపమునకు ఐదు ముఖ్యభాగములు. ఇటికతోగాని రాతితోగాని కట్టినపునాది లేక వేది.–నడుము లేక అండ–హర్మిక–ఛత్రము–స్థూపమునకు చుట్టూ కట్టినకంచె దీనికి నాల్గు ప్రక్కలనూ నాలుగు మార్గములుండెను. ఆరాధకులు వీటిద్వారా లోనికి పోయి స్థూపముచుట్టూ ప్రదక్షిణము జరిపెదరు. స్థూపమునకు నాలుగు ఆయకవేదికలు స్థంభములు ఉండును. ఇతర శిల్పములు, యుండును. చైత్యాలయమునందు రాతిమీద అందమైన చెక్కడములు అనగా పువ్వులు లతలు పక్షులు మృగములు మొదలగునవి కనబడును. గుంటుపల్లిలో కొండరాయి దొలిచి కట్టినస్థూపములు కొన్నియు, ఇటుక లేక రాతితో కట్టినవి కొన్నియు గలవు. మొత్తముమీద చిన్నవి పెద్దవి అరవై ఐదు స్థూపములవరకు గలవు. [illegible] భూమి విస్తీర్ణము 9,400 చదరపు గజములుండునని తెలియును. ఒకస్థూపమునందు ఒకచిన్న రాగిపాత్ర, ఒకపెద్ద తెల్లగాజుపూస, ఒక బంగారపు అక్షయపాత్ర రెండు బంగారపు పువ్వులు దొరికినవి.

గుంటుపల్లిలోని కొండ దొలిచికట్టిన ఒకపెద్ద చైత్యాలయమును దానికి పైభాగమునన్న విహారమును అనేక వేలమంది

యాత్రికులచే చూడబడుచుండెను. అవి చైనాదేశము యాత్రికుడు యూఅన్‌స్వాంగ్ 640 ప్రాంతమున వేంగి రాజ్యముచేరి, గుంటుపల్లి మొదలగు బౌద్ధ క్షేత్రములను గురించి వ్రాసెను

క్రీ. పూ. మూడవ శతాబ్దమున కొండదొలిచి కట్టిన గుంటుపల్లి బౌద్ధదేవాలయం అర్ధగోళాకారముగల పైకప్పుగల్గ రాతిచూరుతో ఏవలుగల గుండ్రనిగోడును ఆకారముల బోలియుండెను. లాంగుహ్రార్ట్సు అనేదొర ఇట్టి చైత్యాలయము గురించి ఇట్లు వ్రాసెను. చైత్యాలయము పైకప్పు అర్ధగోళాకారముగల్గి గుజ్జపులాడమును పోలిన చూరుకల్గి, చెక్కినరాతి వాసములతో ఒప్పుచుండెను. అప్పటికాలపు బౌద్ధ చైత్యాలయములన్నియు ఇట్లే కట్టబడెను. నీలగిరియందు నివసించు తోడాలగుడిసెలు పోలికలో కట్టబడెను. వెదురువాసములతో కట్టిన బండిపైకప్పును జ్ఞప్తికి తెచ్చును. దరిమిలాను అజంతా ఎల్లోరా బౌద్ధ చైత్యములందు యీ శైలియే కనబడును. చైత్యాలయ గర్భమందు ఒక స్థూపముగలదు. అదియు ఏకశిలా చెక్కడము-చైత్యాలయమున కావలదావినంటి బౌద్ధసన్యాసులు నివసించుటకై పెక్కుగదులు దొలపబడినవి. ఇటీవల పురావస్తుశాఖవారు యీ చైత్యసూపములను మెట్లను సంఘరామమును బాగుచేయించిరి. చైనా యాత్రికుడు యు అన్ స్వాంగ్ యీమతమును విహారమును ఇట్లు వర్ణించెను-వేంగికి సమీపముననున్న ఒకగొప్ప సంఘారామము గుంటుపల్లి ఎత్తయిన గోడలున్ను అంతస్థులుగల గోపురములున్ను శిల్పములతో అలరారు మేడలున్ను కల్గియుండెను దీనికి స్థపమందున రెండు సూపములలో ఒకటి అనేకవందల అడుగుల ఎత్తుకల్గియుండెను.

ప్ర: యీ కట్టడములలో నివసించు బౌద్ధసన్యాసులు ఎట్టి నియయము లాచరించుచుండిరి? ఎట్లు ప్రజలకు ఉపయోగపడుచుండిరి?

జ: గుంటుపల్లి సంఘారామమునందు అనేక అంతస్తులుగల విహారములుండెననియు, అవి అనేకమంది బౌద్ధభిక్షువులతో నిండెననియు, యు అన్ స్వాంగ్ వ్రాతలవలన తెలియును. బౌద్ధసన్యాసులు కొన్ని మంచి నియమములతో తమ సంఘమును మతమును బలపరుచుకొనుచుండిరి. వారి మత గ్రంధములతో నిండినపెక్కు భాండాగారములువారికుండెడివి. బుద్ధ, ధర్మ, సంఘ అను త్రిరత్నములను పోషించుకొనుటయే వారి ముఖ్యధర్మము. అందుకు స్వయంకృషి, విద్యాభివృద్ధి తపస్సు, ఆరాధన, ధర్మబోధన చేయుచుండెడివారు. విహారమునకు చేరువుగా విద్యాపీఠముండెడిది అందు భిక్షువులు తమధర్మములను నియమములను శాస్త్రములను నేర్చుకొనుచుండెడివారు. గురువులవల్లను, పుస్తకభాండాగారములవల్లను స్వయంకృషివల్లను విద్యనభ్యసించుచుండెవారు. వ్యాకరణము సూత్రములు, తత్వశాస్త్రము, తాంత్రికము, పురాణము, ఆయుర్వేదము మొదలగునవి నేర్చుకొని చుట్టుప్రక్కలనుండిన గ్రామములవల్ల భిక్షపొందుచు ప్రజలకు కావలసిన జ్ఞానము ఇచ్చుచుండెడివారు. యీకాలమున శాంతి అహింస సత్యము ధర్మము మొదలగు సుగుణములు ప్రబలియుండుటచేత పాళీలేక ప్రాకృతము సంస్కృతము కూడ ప్రబలినది. అనేక శాస్త్రములున్నూ అనేక విషయములను గురించిన గ్రంధములున్ను వెలువడినవి. సామాన్యులకు తెలియునట్లు వారిభాషలోనే అనగా ప్రాకృతములోనే బౌద్ధపురాణగాధలు వ్రాయబడెను బుద్ధుని ధర్మములు బోధింపబడెను. అశోకుని శాసనములు వ్రాయబడెను. గుంటుపల్లిలో క్రిందినుండి పైభాగమునకు అనగా చైత్యాలయము చేరుటకు ఒక బౌద్ధసన్యాసిని మెట్లు కట్టించెనని పాలిభాషలో చెక్కబడిన ఒక శిలాశాసనమునుబట్టి తెలియుచున్నది. ఇట్టి పురాతన శాసనములుగల సూపములు అమరావతి భట్టిప్రోలు సంఘారామము రామతీర్థములందును గలవు. అవి క్రీస్తు రెండవ శతాబ్దినాటివి. గుంటుపల్లి రాతి శిల్పములు రాతిశిల్పములను బోలియున్నవి. చైత్యముయొక్క విస్తీర్ణము 53 న్నర అడుగులు పొడవు 14 న్నర అడుగులు వెడల్పు. గుమ్మమున కిరుప్రక్కలనున్న గూళ్ళయందు సుద్దరాతితో చేసిన బుద్ధుని విగ్రహములు గలవు. వాటిని బౌద్ధమతస్థులు పూజించుచుండెవారు. విహారపుగోడలమీద పాలిశాసనముల చిహ్నములుగలవు. ఆంధ్రదేశములోని కట్టడపు పనితనము శిల్పశైలి చిత్రలేఖనము వాఙ్మయము భాషమతము, విద్య అన్నీ బౌద్ధమత సాంప్రదాయములన్నవల్ల వృద్ధిపొందెను-బౌద్ధసంఘములు, భిక్షువులు విద్యావంతులై క్రమశిక్షణలోబడి తమతమ విధానములను సంస్కృతిని ఇతర దేశములకు పోయి అందు వ్యాపింపజేసిరి. ధర్మం, సత్యం, నీతి, విద్య, అహింస,ప్రజలకు బోధించిరి. బుద్ధునే దైవంగా భావించి ధర్మాలను అవలంబించి వాటిని వ్యాపింపచేయమని బోధించుచుండిరి.

# స్వతంత్ర భారతము (కవిత)

కన్నెకంటి వీరభద్రాచార్యులు

(పల్నాటి సోదరకవి)

అలమిన కాఱుఁజీఁకటుల నట్టిటు నెట్టి కళాప్రపూర్ణయై
వలపలి చేత చక్రాంకిత త్రివర్ణ పతాక ధరించి మోదముం
గొలుపుచు వెల్గుచున్న దదిగో నవభారత రాజ్యలక్ష్మి, చె
న్నలరెడు గద్దెపై జయజయ ధ్వను లాకసమంటి మ్రోఁగఁగన్

తీయని ధారలూరెడి నదీనదముల్ ప్రవహించి కాల్వలై
పాయలు పాయలై కదలి పంటపలంబులఁ జేరి సారముం
జేయుచు ధాన్యసంపదలఁ జిమ్ము బలంబొదవ గూర్చుచుండె సు
స్థాయిని హాయినింగని ప్రజల్ ముదమంద సమస్తకాలముల్.

పదివదిగా బలవంతులయి వర్ధిల్లుచున్నవి యెండవానలన్
జెడి పడుచున్న పూరిగుడిసెల్ జవసత్త్వకళావికాసులై
వెడుముచు నున్నవార నొకనాఁడు నిరాశ్రయులై దరిద్రులై
యడుగిడలేని సోదరులు హర్షపయోనిధి నోలలాడుచున్.

అదిగదిగో ప్రసన్న హృదయాంబుజయై కరుణాసమేతయై
చదువుల రాణి సర్వజన సంఘములన్ దశవింప దీక్షతోఁ
గదలెఁ బ్రయాణమై వసిఁడి గంటము గేల ధరించి జ్ఞాన సం
పదల నలంకరించి నవభారత లక్ష్మి సముద్ధరింపఁగన్.

సకల కళాధురంధరులు సాత్త్విక భావులు ధీరులైన నా
యకుల సమీక్షతో నుదయమై జయసూచన లిచ్చు వత్రపతా
కలు సమస్త కాలముల ఫలించుచు నున్నవి దిగ్దిగంతముల్
ప్రకటన చేయుచున్నయవి భారతరాజ్య రమాయశోద్యుతిన్.

అరమర దాల్పఁబోక నిజమాడుచు ధర్మము బోధచేయుచున్
గురుకరుణన్ సహించి యిరుగుం బొరుగున్ గరుణార్ద్రి జూచుచున్
శరణము వారి నేలుచు, స్వసంస్కృతిఁ గ్రాలుచు భక్తితోఁ బరా
త్పరుని భజించుచున్ మధుర భారతలక్ష్మి ధరించెఁ గీర్తిన్.

కుల మత వర్గ వైరములకుం గురిగాక విదేశ వాసులం
జులకన చేయఁబోవక యసూయ మెలంగక యెచ్చు తగ్గులం
దలఁపక సత్యధర్మముల దప్పక భారత రాజ్యలక్ష్మి నేఁ
డల రచనుండె వారతుల నందుచుఁ బొందుచుఁ గీర్తిసంపదన్.

కలవు నదుల్ గనుల్ వసిఁడి కండల నిండి మహాతరుల్ గిరుల్
కలవు వనుల్ నిధుల్ కలవు కమ్మని పంటల నిచ్చు క్షేత్రముల్
కలవు శ్రుతుల్ స్మృతుల్ కలవు గర్వమునన్ గలదెంతొ స్వీయమా
లగము గాన నేటి జయభారత లక్ష్మికి లోటు కల్గునే!

విధ తపఃకళానిధుల వీరవరేణ్యుం దేశనాయక
వరుల శిల్పిశేఖరుల భక్తుల గాయక చక్రవర్తులన్
వుల మహాపతివ్రతలఁ గర్షక కార్మిక యోధులన్ జయో
వములఁ గన్న భారతికి సాగిలి మ్రొక్క విచార ముండునే?

పురములు వృద్ధిఁ బొందినవి పుణ్యనిధుల్ విలసించె గుళ్ల గో
పురములు కాంతిఁగన్నవి యపూర్వకళన్ ధరియించి, పేద కా
పురములు భోగభాగ్యములఁ బొందుచు నున్నవి తా స్వతంత్రయై
సురుచిర నవ్యభారత వసుంధర కూరిమి బెంపు దీపెసల్.

పాయకపత్త్రపంబులను బల్లెల వృద్ధికిఁ దెచ్చుచుండెఁ బ
చాయతి రాజ్యలక్ష్మి సువిశాల గుణమ్ములతో జనించి జా
తీయకళన్ వరించి ప్రగతిన్ విహరించి సమస్త మానవ
శ్రేయము నెంచి శాంతి సహజీవనమున్ సమకూర్ప దీక్షమై.

అఖిలముల్ ఖండించుచు మహాటవులన్ గిరిగహ్వరాదులన్
మూకలు మూకలై తిరుగు మూఢజనమ్ములఁ గూర్మి పేర్మిపై
చేకొని సంస్కరించి నవజీవనముల్ సమకూర్చుచుండె స
న్లోకమనీష భారత వసుంధర చల్లని తల్లి కావునన్.
వెలువడియెం బురాతన పవిత్ర చరిత్రలు దైవశిల్పముల్
వెలువడె జాతి వైభవము వెల్వడఁజేసెడి గానసేవకుల్
వెలువడె కాలగర్భమున వీగిన పల్లెలఁ బట్టణంబులున్
బలువుర సంతసింప నవభారతలక్ష్మి జయంబు గాంచుటన్.

ఈ పుణ్యదినమునందే కదా ఫలియించె
గాంధీ మహాత్మ దీక్షావతస్సు
ఈ పుణ్యదినమునందే కదా వరియించె
వీరాధివీరులన్ విజయలక్ష్మి
ఈ పుణ్యదినమునందే కదా మొరయించె
జయశంఖరవములన్ శాంతిరణము
ఈ పుణ్యదినమునందే కదా కదలె సు
వ్యద్దీప్తిఁ దాల్చి స్వాతంత్ర్య రథము
ఈ మహాపుణ్యదినమునందే కదా! ద
యా రసము చింద గుణబింబ భారతాంబ
యధివసించెను మాతృ సింహాసనమున
ప్రజలకు లోవరింతు వీ సుధాపర్వమునకు

జనము సత్త్వమున్ గలిగి సత్యము ధర్మము నిల్ప దివ్యగో
రవము గడించి యభ్యుదయ రత్నములన్ వెలయించి భవ్యమై
భవములతోఁ జరించి జయభారత రాజ్యరమాలలామ తా
రవిశశితారకమ్ముగ విరాజిలఁ గోరి శుభమ్ము లిచ్చుచున్.

(4-వ పేజీ తరువాయి)

వస్నుడై యిపుడు యీ పరిస్థితి నిజంగా హర్షించదగినదే. కాని యిది వాస్త వికతకు దూరమైన సత్యం.

త్యాగధనులు, దేశభక్తులు అయిన నాయకుల, వీరుల మహాపురుషుల జీవితగాధల, వారు సలిపిన ఘన కార్యములు, కాబి పౌరులు కాదగిన నేటి బాలబాలికలకు గేయరూపంలో పరిచయం చేయటం, వారి లేత మన స్సులలో ఉదార భావాలు మొలక లెత్తించడం బహుధా ప్రశంసనీయం దేశభక్తి ప్రపూరితమైన మహాపురు షుల జీవిత గాధలను గేయరూపంలో బాల బాలికలు కంఠస్థం చేసినపుడు వారికి ఆ మహాపురుషుల నామము లతో పరిచయం గలగడమేగాక, వారు చేసిన మహత్తర కార్యములు గూడా కథలరూపంలో అవగాహన మౌతవి. ఆ మహా పురుషులు వారి జీవితకాలంలో సాధించిన అఖండ కార్యములు, పఠితల మనో నేత్రాల ముందు ఎప్పుడూసాక్షాత్కరిస్తూవుంది నిరంతరము ఉత్తేజము కలిగిస్తవి, తెలుగు మధికారములోని సొంపు సెంపులో, కోమల శైలిలో, అన్వయ కాఠిన్యము లేకుండా, లయబద్ధమై సాగిన యీ గేయము పాఠకులను లెన్నగ నాకర్షించగలదు



## సత్కథామంజరి

రచన: పురాణపుండ కృష్ణమూర్తి

ఖ్యానముల రూపంతోను పురాణ డించినారు వీటినుంచి కొన్ని కథలు లుగా చెప్పారు. ఉన్నత శీలమును

ఇది కథల సంపుటి. మహా తపః ములు, ఇతిహాసములు, బ్రాహ్మణ స్వీకరించి కొందరి మహర్షుల, ఋ విజ్ఞానమును, ప్రస్ఫుటంజేసి యీ

సంపన్నులైన ఋషులు భారత ములు, సంహితలు, రామాయణ పత్నుల, రాజన్యుల గాధలు ఆకర్ష కథల ధారావాహిక ప్రచురణ బహ

ప్రజల జీవితాదర్శమును, లక్ష్య భారతములు, ఉపనిషత్తులు, శృతి బీయంగా, ఉత్తేజం కలిగించేటట్టుగా జనాదర పాత్రమై విశేష ప్రయో

ములను కథల రూపంలోను, ఉపా స్మృతుల రూపంలో లోకానికి వెల్ల యీ రచయిత తిరిగి నాటిని కథ జనకారి కాగలదు.

# ప్రసార విశేషాలు

## మద్రాస్ షార్ట్‌వేవ్ ప్రసారాలు

ఉదయం 19·30 మీ (6085 కిలోసైకిల్స్)

మధ్యాహ్నం 41·32 మీ (7260 కిలోసైకిల్స్)

సాయంత్రం 60·98 మీ (4920 కిలోసైకిల్స్)

పైన ప్రచురించిన షార్ట్‌వేవ్ మీటర్లలో ఉదయం 7-00 నుండి 7-15 వరకు, మ॥ 1-50 నుండి 2-00 వరకు, సాయంత్రం 7-00 నుండి 7-15 వరకు, రాత్రి 9-30 నుండి 10-30 వరకు మద్రాస్ (ఎ) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

సోమవారములు రాత్రి 9-15 గంటలనుండీ, బుధవారములు రాత్రి 7-45 నుండి 9-30 వరకూ పై మీటర్లలో మద్రాస్ (ఎ) కార్యక్రమాలను వినవచ్చును. తక్కిన సమయాలలో పై షార్ట్‌వేవ్ మీటర్లలో మద్రాస్ (బి) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

### మార్కండేయ చరిత్రం

మార్చి 16 వ తేదీన శుక్రవారం నాడు రాత్రి 9-30 గంటలకు మేలట్టూర్ సంప్రదాయానికి చెందిన "మార్కండేయ చరిత్రం" సంగీత నాటిక విజయవాడ కేంద్రంనుండి ప్రసారము చేయబడును.

రచన: మేలట్టూర్ వెంకటరామశాస్త్రి

సంప్రదాయ సంగీతం: మేలాటూర్ బాలు భాగవతర్

సేకరణ: టి శంకరన్

నిర్వాహణ: ఓలేటి వెంకటేశ్వర్లు

పాల్గొనువారు:

నాళం వనజాగుప్త
వింజమూరి లక్ష్మి
డి. పశుపతి
ఎం వి. రమణమూర్తి
పి. సూర్యారావు
చల్లా కృష్ణమూర్తిశాస్త్రి
కోనెల్ల రామమూర్తిశాస్త్రి
ఎన్ సి వి. జగన్నాధాచార్యులు

* * *

నదులు మన చిరకాలపు నేస్తాలు. సృష్టి కలిగినప్పటినుంచీ అవి మన దాహం తీరుస్తున్నాయి. ఇప్పుడు అశేషజనానీకానికి బహుళ ప్రయోజనార్థం వాటికి ఆనకట్టలు కడుతున్నారు మార్చి 18 వ తేదీ మధ్యాహ్నం 2-20 గంటలకు, మూడవ ప్రణాళిక కింద నదీజల వథకాలమీద బాలలకు ప్రత్యేకంగా రచించిన "పాతమిత్రులతో పరిచయము" అనే రూపకం ఆకాశవాణి, హైదరాబాదునుంచి కేంద్రం వింటారు.

* * *

మంచి ఆస్తి వస్తుందనే ఆశతో భాగ్యవంతులైన చుట్టాలు చవిపోయినప్పుడు మొసలికన్నీరు కారుస్తారు. "పరామర్శ" అనే తెలుగు నాటిక ఒక ముసలమ్మ కథ. ఆమె భాగ్యవంతురాలు కావడంవల్ల చుట్టాలు ఆమెను చాలా గౌరవంగా చూస్తారు. కాని తుదిఘడియల్లో ఆమె మొగమే చూడరు మార్చి 23 వ తేదీ రాత్రి 9-30 గంటలకు ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసారమవుతుంది.

* * *

ప్రపంచపు నడకకు పనే వడుగూ పేకా పనివల్లనే సత్యంయొక్క ప్రయోజనాలూ శక్తులూ బహిర్గతమౌతాయి. నిరంతరమైన విశ్వశక్తి వల్లనే ప్రపంచపుబోడ తల్లక్రిందులు కాకుండా వుంది. మనుష్యుడుకూడా నిద్యుక్త కర్మద్వారానే జీవిత పరమానందం తెలుసుకుంటాడు "స్వేదకణాలు" అనే తెలుగు నాటికకు ఇదీ వస్తువు. మార్చి 28 వ తేదీ రాత్రి 8 గంటలకు ఈ నాటిక ఆకాశవాణి. హైదరాబాదునుంచి ప్రసారమవుతుంది.

* * *

ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో భద్రాచల దేవాలయం ఒకటి. ప్రజలలోవుండే మతాసక్తిని పెంచుతూ ఇటీవలనే దీనిని పునర్నిర్మాణం చేశారు.
లక్షలాది జనులకూ మనఃప్రియమైన ఈ రామాలయ విశేషాలను వివరిస్తూ రచింపబడిన "యాత్రస్థలాలు-భద్రాచలం" అనే తెనుగు రూపకం, మార్చి 26 వ తేదీ సా॥ 6-15 గంటలకు, ఆకాశవాణి, హైదరాబాదు-నుంచి వినవచ్చు.

### డైవోర్స్

రంగస్థల నాటిక

మార్చి 17 వ తేదీ శనివారం రాత్రి 7-40 గంటలకు ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి 'డైవోర్స్' రంగస్థల నాటిక వినగలరు

రచన: సిద్ధాంతి మల్లికార్జునం

సమర్పణ: నాగార్జున కళామందిర్, నెల్లూరు

పాల్గొనువారు:

అమరనాథ్, కె. రాజగోపాల్
మహాదేవయ్య,
పి హెచ్. సుందరరామిరెడ్డి
రామానుజం, బి సంపత్
దామోదరం, వి. నాగేశ్వరరావు
ఓంకారం, ఎస్. ఉమాశంకర్

* * *

మార్చి 26 వ తేదీ రాత్రి 9-45 గంటలకు, "అమరభారతి" త్రైమాసిక సంస్కృత మాగజైన్ కార్యక్రమంలో, సుప్రసిద్ధములైన కొన్ని ఉపనిషత్ సూక్తుల వేదాంతార్థాన్ని బహిర్గతంజేసే "వాక్యార్థం", సంస్కృతంలో చర్చ, ఆకాశవాణి, హైదరాబాదునుంచి ప్రసారమవుతుంది. శ్రీ కె. సోమశేఖరశాస్త్రి, శ్రీ సూరి రామకోటిశాస్త్రి, శ్రీ యస్ లక్ష్మీనారాయణమూర్తి అవధాని. శ్రీ కె. శేషావధాని, శ్రీ సి. హెచ్. సుబ్రహ్మణ్యం చయనులు, ఈ చర్చలో పాల్గొంటారు

## శుక్రవారం మార్చి 16

శక 1883 ఫాల్గుణ 25

## మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానం

6-50 ఉదయస్వరగాన్

7-00 వాద్యగోష్ఠి♦

7-10 నేటికార్యక్రమ వివరణ
వాతావరణసూచన (తమిళం)♦

7-15 తమిళమున వార్తలు

7-30* నాదస్వరం
(తిరుచ్చినుండి రిలే)

8-00 మధురగీతం†

8-15 ప్రసార సమాప్తి

**ప్రత్యేక ప్రసారము**

8-30 సంగీత కచేరీ
(హైదరాబాదునుండి రిలే)

9-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

416.7 మీ (720 కిలోసై)

1-00* హిందూస్థానీ సంగీతం
పన్నాలాల్ ఘోష్: వేణువు‡

1-30 గానమంజరి†

1-40 హిందీలో వార్తలు

1-50 గీతమంజరి†♦

2-00 తమిళమున వార్తలు

2-10 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

416.7 మీ (720 కిలోసై)

5-30* క్లారినెట్:
నిలయవిద్వాంసులు

5-45 గాంధీకథ (తమిళము)

6-00 భజన్†

6-05 ప్రాంతీయ సెయిదిగళ్

6-15 గ్రామస్థులకు (తమిళం)
(తిరుచ్చినుండి రిలే)

7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పైగూడా

7-15 తమిళమున వార్తలు

7-30* నేదునూరి కృష్ణమూర్తి
(విజయవాడనుండి రిలే)

9-00 వాద్యగోష్ఠి

9-15 కదంబం†

9-30 మార్కండేయ చరిత్రం
సంగీత రూపకము
(విజయవాడనుండి రిలే)

11-00 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

49.30 మీ (6085 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె

7-00 తెలుగులో వార్తలు**

7-15 సంగీతమాల†

7-30 మీనాక్షి అమ్మైపిళ్ళై తమిళ్:
పి. ఎ. ఎస్. రాజశేఖరన్

8-00 ఆంగ్లమున వార్తలు

8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ 1420 కిలోసై)

41.32 మీ (7260 కిలోసై)

12-00* కార్మికుల కార్యక్రమం

12-30 ప్రసార సమాప్తి

ప్రసారము II (తరువాయి)

1-00 మాదర్ నిగళ్చి
స్త్రీలకు (తమిళము)

1-30 ఆంగ్లమున వార్తలు

1-40 గీతమంజరి†

1-50 తెలుగులో వార్తలు**

2-00 మధురగీతం†

2-10 ప్రసార సమాప్తి

## విజయవాడ

ఉ॥ ప్రసారము I

(357.1 మీ (840 కిలోసై)

6-30* శుభోదయం
ఆకాశవాణి
కె. రామభద్రరావు గేయం
లక్ష్మి. రత్నం

6-35 భక్తిరంజని
(హైదరాబాదునుండి రిలే)

6-55 ప్రసార వివరణ

7-00 తెలుగులో వార్తలు

7-15 గాంధీమార్గము
గాంధీజీ జీవితగాథలు. భజన్

7-30 హైదరాబాద్ వలె

8-00 ఆంగ్లమున వార్తలు

8-15 హిందీలో వార్తలు

8-30 సంగీత కచేరీ
(హైదరాబాద్‌నుండి రిలే)

9-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)

60.98 మీ. (4920 కిలోసై)

5-30* పాశ్చాత్యసంగీతం†

5-50 స్థానిక ప్రకటనలు,
వాణిజ్యవార్తలు (ఆంగ్లం)

6-00 ఆంగ్లమున వార్తలు

6-05 మద్రాస్ ఎ వలె

6-15 కార్యక్రమ వివరణ
(తమిళము)

6-20 ఎం. ఎస్. సుబ్బులక్ష్మి

7-00 తెలుగులో వార్తలు**

7-15 సంగీతమాల†

7-30 మద్రాస్ ఎ వలె

9-00 ఆంగ్లమున వార్తలు

9-15 The Species in Variation- the Gourmet talk by P. G. Chochrane

9-30 Radio Report on Azad Memorial Lectures 'Gatel ways of Knowledge by Dr.C. V. Raman (relay from Delhi)

10-00 పాశ్చాత్య సంగీతం**

11-00 ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 56-వ పేజీలో)

♦ షార్ట్‌వేవ్‌పైగూడా

** మీడియంవేవ్‌పై మాత్రం

మ॥ ప్రసారము II

11-30* రాగగానము

11-40 ఫిల్మ్ సంగీతం†

12-10 ప్రతాపరుద్రమదేవి
నాటిక (6-వ భాగం)
శ్రీ॥ శ్రీ॥ కె. నారాయణరావు
నవల ఆధారంగా
రేడియో అనుసరణ:
పువ్వాడ శేషగిరిరావు

12-30 కార్మికుల కార్యక్రమం
గాలిగుండె
హాస్యకథ: ఎన్. వి. విఠల్
కబుర్లు
ఫిల్మ్‌సంగీతం

1-00 ఎమ్. ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ
వాద్యబృందమునహా

1-30 రేడియో కళాశాల
విశ్వవిద్యాలయాలకు
రాజ్‌మహల్ నాటిక
మలయాళ మాతృక;
మలయాట్టూర్ రామకృష్ణన్
తెలుగు; పుట్టపర్తి
నారాయణాచార్యులు
సమర్పణ; పి.ఆర్. ప్రభుత్వ
కళాశాల విద్యార్థులు, కాకినాడ
బృందగానము

1-50 తెలుగులో వార్తలు

2-00 గీతగోవిందం
సంగీత రూపకము

2-30 సుగంధారామున్,
వసంతరాగామున్

4-30 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు

6-05 ప్రాంతీయవార్తలు

6-15 గ్రామస్థుల కార్యక్రమం

7-00 తెలుగులో వార్తలు

7-15 గ్రామస్థుల కార్యక్రమం

7-30 రేడియో సప్తాహం
నేదునూరి కృష్ణమూర్తి
ఎమ్. చంద్రశేఖరన్: వయొలిన్
వి. కమలాకరరావు: మృదంగం
గుంటుపల్లి కృష్ణమూర్తి:
కంజీరా
(ఆహూతుల సమక్షమున)

9-00 ఆంగ్లమున వార్తలు

9-15 పదములు;
టి. బృంద, టి. ముక్త

9-30 మార్కండేయ చరిత్రం
సంగీత రూపకము
నిర్వహణ; ఓలేటి వెంకటేశ్వర్లు

11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డింగ్

శుక్రవారం మార్చి 16

## హైదరాబాదు-ఎ

405·4 మీ (740 కిలోసైౖ)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని: తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల సంకీర్తనలు
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 గాంధీమార్గము (విజయవాడనుండి రిలే)
7-30 ఎమ్. శ్రీరామానుజాచారి
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 హిందూస్తానీ సంగీత కచేరీ గంగూబాయ్ హంగల్: గాత్రం కాశీనాద్ ముఖర్జీ: సితార్
9-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమం (విజయవాడనుండి రిలే)
1-00 స్త్రీసంసార్ (హిందీ)
1-50 తెలుగులో వార్తలు
2-00 సుగమ్ సంగీత్
2-10 ఉర్దూలో వార్తలు
2-20 జానపద సంప్రదాయసంగీతం: ఆకాశవాణి బృందం సంగీత రచన: ముజహిద్ అలీ అన్సారీ సమర్పణ: ఎమ్. జె. రావు
2-35 సుగమ్ సంగీత్
2-50 ఎమ్. జె. రావు: సరస్వతీవీణ
3-30 హైదరాబాదు బి వలె
4-30 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ఉర్దూలో కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు
7-15 గాంధీవచ్ (హిందీ)
7-30 హిందూస్తానీ సంగీత కచేరీ గంగూబాయ్ హంగల్ గాత్రం కాశీనాద్ ముఖర్జీ: సితార్ (ఆహూతుల సమక్షమున)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూ వార్తలు
9-30 Radio Report on Azad Memorial Lectures, 1962 (relay from Delhi)
10-00 హైదరాబాదు బి వలె
11-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I

60·12 మీ (4990 కిలోసైౖ)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము II (తరువాయి)

42·02 మీ (7140 కిలోసైౖ)

8-00 హైదరాబాద్ ఎ వలె
9-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42·02 మీ (7140 కిలోసైౖ)

12-30* హైదరాబాద్ ఎ వలె
1-00 ఎమ్. సీతారామానుజాచారి
1-50 హైదరాబాద్ ఎ వలె
2-00 గీతగోవిందం సంగీత రూపకం (విజయవాడనుండి రిలే)
2-30 సుగంధాంమన్, శకుంతలారామన్ (విజయవాడనుండి రిలే)
4-30 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

60·12 మీ (4990 కిలోసైౖ)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమము నీలాటిరేవు: స్త్రీలకు పిల్లల కార్యక్రమము రంగులరాట్నం ప్రకటనలు, ధరలు. వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము గాంధీ సుభాషితాలు చేయంగల విన్నపాలు
7-30 వేమనూరి కృష్ణమూర్తి (విజయవాడనుండి రిలే)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 నిహారిక
9-30 మార్కండేయ చరిత్రం సంగీత రూపకము (విజయవాడనుండి రిలే)
11-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I

491·8 మీ (610 కిలోసైౖ)

7-00* సుప్రభాత కార్యక్రమ వివరణ స్తోత్రమాల
7-15 గాంధీస్మృతి
7-30 ఎన్. శ్రీనివాసన్: నాదస్వరం
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 వాద్యబృందము
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* ఎన్. శ్రీనివాసన్: నాదస్వరం
12-30 వనితావిహార
1-10 కన్నడమున వార్తలు
1-20 హెచ్. ఆర్. లీలావతి: కన్నడ గీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 గానవైవిధ్య† బి. ఎస్. రాజఅయ్యంగార్
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 ఉర్దూ పాటలు†
6-20 వనమాల దేశ్‌పాండే: కన్నడ పాటలు
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 సంగీత కచేరీ (మద్రాస్‌నుండి రిలే)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 సమాచారసమీక్ష
9-25 సారంగి
9-30 రేడియో సప్తాహం మార్కండేయ చరిత్రం (విజయవాడనుండి రిలే)
11-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## తిరుచ్చి

ఉ॥ ప్రసారము I

319·1 మీ (940 కిలోసైౖ)

6-45* మంగళగానము
6-50 భక్తిగీతాలు
7-00 వాద్యసంగీతము
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 ఇశైకోవై: నాదస్వరం
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30* ప్రసార సమాప్తి

ప్రసారము III

1-00* మాదర్‌నిగప్పి స్త్రీలకు (మద్రాస్‌నుండి రిలే)
1-30 వాద్య సంగీతము†
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతము†
2-00 తమిళమున వార్తలు
2-10 విరామ సంగీతము†
2-15 అఖిలభారత సంగీత కచేరీల నుండి కొన్ని ఘట్టాలు
2-45* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

4-45* వివిధభారతి
5-45 గాంధీకథ (మద్రాస్‌నుండి రిలే)
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయవార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 మద్రాస్ వలె
8-55 Today in Parliment (relay from Delhi)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 పలకణి
9-30 మద్రాస్ వలె
11-00* ప్రసార సమాప్తి

## శనివారం మార్చి 17

శక 1883 ఫాల్గుణ 26

## మద్రాస్ ఎ

**ఉ॥ ప్రసారము I**

416.7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానము
6-50 తుదిప్పాకల్‌గళ్
7-00 వాద్యగోష్ఠి •
7-10 నేటికార్యక్రమ వివరణ, వాతావరణ సూచన(తమిళము)•
7-15 తమిళమున వార్తలు
7-30† వాద్యమాధురి†
7-45 రేడియో తెయిమెలర్ వార్తావాహిని (తమిళము)
8-00 మధురగీతం†
8-15 ప్రసార సమాప్తి

**ప్రత్యేక ప్రసారము**

8-30 గానసుధ కేరళ భక్తసంగీతము
9-00 రంగగీతె కన్నడ రంగస్థలసంగీతము
9-30 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

416.7 మీ (720 కిలోసై)

1-00† కదంబం†
1-30 గానమంజరి†
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి†
2-00 తమిళమున వార్తలు
2-10 వీణ. నిలయవిద్వాంసుడు
2-30 సి. ఆర్. లక్ష్మీనారాయణ రావు
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము III**

416.7 మీ (720 కిలోసై)

5-30* టి. ఆర్. సి. అయ్యంగార్
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
(7-00 నుండి 7-10 వరకు షార్టువేవ్‌పై కూడా)
7-15 తమిళమున వార్తలు
7-30† ఎమ్. ఎ. మాలతి
8-00 ఎస్. బాలచందర్. వీణ
8-30 Radio Report on Azad Memorial Lecture Given ... delivered by Dr. C. V. Raman (relay from Delhi)
9-00 కులమంగలం ఆర్. జయలక్ష్మి, ఆర్. రాజలక్ష్మి
9-15 మధురగీతం†
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము ద్వారం వెంకటస్వామినాయుడు వయొలిన్ (ఢిల్లీనుండి రిలే)
11-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్ బి

**ఉ॥ ప్రసారము I**

211.3 మీ (1420 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు **
7-10 సుప్రభాతమ్ సంస్కృత కార్యక్రమము
7-30 మద్రాస్ ఎ వలె
7-45 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

211.3 మీ (1420 కిలోసై)
41.30 మీ (7260 కిలోసై)

1-00† మద్రాస్ ఎ వలె
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 గీతమంజరి†
1-50 తెలుగులో వార్తలు **
2-00 మధురగీతము†
2-10 ముత్తుక్కువియల్ పిల్లలకు (తమిళము)
3-30 For Children Conducted by Uncle Handel
3-30 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము III**

211.3 మీ (1420 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతము†
5-50 స్థానిక ప్రకటనలు,
[illegible] వాణిజ్యవార్తలు (ఆంగ్లము)

## విజయవాడ

**ఉ॥ ప్రసారము I**

357.1 మీ (840 కిలోసై)

6-30† శుభోదయం
6-35 భక్తిరంజని: శ్రీవేంకటేశ్వర సుప్రభాతమ్
6-37 ప్రసార తరంగిణి
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతశిక్షణ
7-30 అఖిలభారత సంగీత కచేరీల నుండి కొన్ని ఘట్టాలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 కేరళ సంగీతము (మద్రాస్‌నుండి రిలే)
9-00 కర్ణాటక రంగస్థల సంగీతము (మద్రాస్‌నుండి రిలే)
9-30 ప్రసార సమాప్తి

---

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరణ (తమిళము)
6-20 పిఠాపురం సత్యనారాయణ. క్లారినెట్
7-00 తెలుగులో వార్తలు **
7-10 సంగీతమాల†
7-30 వేంగై తిరయన్ రంగస్థల నాటిక (తమిళము) (తిరుచ్చినుండి రిలే)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 Talk
9-25 వాద్య సంగీతము†
9-30 పాశ్చాత్య సంగీతము† **
11-00 ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)

వివిధ భారతి (రిలే)

(వివరాలు 56 వ పేజీలో)

• షార్టువేవ్‌పైకూడా
** మీడియంవేవ్‌పై మాత్రం

**మ॥ ప్రసారము II**

11-30† సులోచనా మహాదేవన్ డి. పాండురంగరావు: వయొలిన్ యెల్లా సోమన్న: మృదంగం
12-30 కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్‌నుండి రిలే)
1-00 వనితావాణి స్త్రీల కార్యక్రమము
హే భువన మోహినీ టాగూర్ నాటకు తెనుగు; సత్య తేజా నాటిక రచన; భమిడిపాటి రామగోపాలం
మంగళం
1-30 రేడియో కళాశాల విశ్వవిద్యాలయాలకు
అనార్కలి నాటిక రచన; ముద్దుకృష్ణ సమర్పణ; ఎ.ఎస్.ఆర్. కళాశాల విద్యార్థులు, గుడివాడ
బృందగానము
1-50 తెలుగులో వార్తలు
2-00 ఓలేటి వెంకటేశ్వర్లు ఎన్. సి. హెచ్. కృష్ణమాచార్యులు; వయొలిన్ క్రొవ్విడి హనుమంతరావు; మృదంగం
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము III**

4-30* రేడియో బొమ్మరిల్లు పిల్లల ప్రత్యేక కార్యక్రమము నిర్వహణ: ఏడిద కామేశ్వరరావు
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థుల కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము
7-30 జీవము- భూమిపై దాని ఉత్పత్తి ప్రసంగము బి.బి.ఆర్. కృష్ణమూర్తి
7-40 డైవోర్స్ రంగస్థల నాటిక రచన; సిద్ధాంతి మల్లికార్జునం
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 Radio News Reel
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము ద్వారం వెంకటస్వామి నాయుడు: వయొలిన్ (ఢిల్లీనుండి రిలే)
11-00 *వాతావరణ సూచన, ప్రసార సమాప్తి



* [illegible] † గ్రామఫోన్ రికార్డు ‡ [illegible] రికార్డింగ్

శనివారం మార్చి 17

## హైదరాబాదు-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ (విజయవాడనుండి రిలే)
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 గానసుధ కేరళ భక్తిసంగీతము (కోళికోడ్‌నుండి రిలే)
9-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికులకు కదంబ కార్యక్రమము
1-00 వనితావాణి (విజయవాడనుండి రిలే)
1-30 గీతికాగుచ్ఛము: సంగీతనాటక గీతాలు
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-45 బాలసంగీతగోష్ఠి పిల్లల కార్యక్రమము
4-15 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయవార్తలు
6-15 కన్నడ శ్రోతలకు
7-00 తెలుగులో వార్తలు
7-15 ఉర్దూలో వార్తలు
7-30 హైదరాబాద్ బి వలె
7-45 హమారీ భావనా ఏక్ హై ప్రసంగము (హిందీ) గుండేరావ్ హర్కారే
7-55 శ్రోతల ఉత్తరాలకు జవాబులు (ఉర్దూ)
8-00 లలిత సంగీతకచేరీ (ఆహూతుల సమక్షమున) సమర్పణ: ఎమ్. జె. రావు
8-30 Radio Report on Azad Memorial Lectures 1962 (relay from Delhi)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము ద్వారం వెంకటస్వామినాయుడు: వయొలిన్ (ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## హైదరాబాదు-బి

ఉ॥ ప్రసారము I

60.12 మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

42.02 మీ (7140 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
9-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)

12-30 హైదరాబాద్ ఎ వలె
1-00 డి. వి. పలూస్కర్: ఖయాల్, భజన్
1-50 హైదరాబాద్ ఎ వలె
2-00 ఓలేటి వెంకటేశ్వర్లు (విజయవాడనుండి రిలే)
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-45 హైదరాబాద్ ఎ వలె
4-15 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమము ఇరవైయేళ్ళ తర్వాత రూపకము రచన: వి. సహజానంద ప్రకటనలు, ధరలు, వాతావరణం
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము విశేషాలేమిటి చేయంగల విన్నపాలు
7-30 కూచిపూడి నాట్యమేళా కదంబ కార్యక్రమము (కూచిపూడి నృత్యనాటికనుండి) సమర్పణ: చింతా కృష్ణమూర్తి
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఎంత సుదినము: నాటిక రచన: పి. యశోదా తిరుమలరెడ్డి
9-30 హైదరాబాద్ ఎ వలె
11-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## బెంగళూర్

ఉ॥ ప్రసారము I

491.9 మీ (610 కిలోసై)

7-00* సుప్రభాత కార్యక్రమ వివరణ మేళగాన
7-15 వెంకటేశ్వర సుప్రభాతమ్
7-35 నాదస్వరం †
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 దేవకి కె. రావు: కన్నడ పాటలు
8-30 రేడియో సప్తాహం: గానసుధ కేరళభక్తి సంగీతము (కోళికోడ్‌నుండి రిలే)
9-00 రేడియో సప్తాహం: రంగగీతె కర్ణాటక రంగస్థల సంగీతము (ధార్వార్‌నుండి రిలే)
9-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* సంగీత కచేరీ
12-30 బాలజగత్
1-10 కన్నడమున వార్తలు
1-20 ఎస్. రామచంద్రరావు: దేవరనామ
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 ఎస్. రామచంద్రరావు: దేవరనామ
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 ఎస్. రామచంద్రరావు: దేవరనామ
6-25 సుగమ్ సంగీత్ †
6-35 ప్రదేశసమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 యారో ఇల్లదల్లి నాటిక (కన్నడము) మరాఠీ మాతృక: పి. ఎల్. దేశ్‌పాండే
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీతము †
8-45 గానసుధ †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 విజ్ఞాన మున్నడె సమీక్ష (కన్నడము) ఎ. నారాయణరావు
9-25 లలిత వాద్యగీతాలు
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము (ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## తిరుచ్చి

ఉ॥ ప్రసారము I

319.1 మీ (940 కిలోసై)

6-45* మంగళగానము
6-50 భక్తిగీతాలు
7-00 వాద్యసంగీతము
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 ఎస్. శివస్వామి: వయొలిన్
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ఇశైకోవై
8-30 మద్రాస్ ఎ వలె
9-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

1-00* భక్తిపాటలు: వైదీశ్వరన్ కోయిల్ చొక్కలింగం
1-20* పిల్లలకు (తమిళము)
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతము †
2-00 తమిళమున వార్తలు
2-10 ఎస్. శివస్వామి: వయొలిన్
2-45 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

4-45* వివిధభారతి
5-45 సంగీతపాఠము
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 వెంగై తిరైయన్ రంగస్థలనాటిక (తమిళము) రచన: జి. సెల్వం (ఆహూతుల సమక్షమున)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మద్రాస్ వలె
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము (ఢిల్లీనుండి రిలే)
11-00 Radio News Reel‡
11-10 ప్రసార సమాప్తి

* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ‡ రేడియో రికార్డింగ్

## మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416·7 మీ (720 కిలోసైె)

6-45 మంగళగానం
6-50 తుదిప్పాడల్‌గళ్
7-00 గోవాద్యం
7-10 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణ సూచన (తమిళం)
7-15 తమిళమున వార్తలు
7-30* కీవలూర్ సుబ్రహ్మణ్య అయ్యర్
8-00 మధుర గీతము †
8-15 నాదస్వరం (తిరుచ్చినుండి రిలే)
9-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

416·7 మీ (720 కిలోసైె)

12-30* కీర్తనమాల ‡
1-00 హిందూస్థానీ సంగీతము ‡
1-30 గానమంజరి †
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి
2-00 తమిళమున వార్తలు
2-10 వీణ, గోటు వాద్యం; నిలయవిద్వాంసులు
2-30 రంగనాయకీ వరదరాజన్
3-00 నియమం ఉరునమం నాటిక (తమిళము) రచన; సరోజా రామమూర్తి
4-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

416·7 మీ (720 కిలోసైె)

5-30* ఎన్. శ్యామల
6-05 ప్రాంతీయ తెయిదిగళ్
6-15 గ్రామస్థులకు (తమిళం) (తిరుచ్చినుండి రిలే) (7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పైగూడా)
7-15 తమిళమున వార్తలు
7-30* రుక్మిణీ రాజన్; వీణ
8-00 ఎ. అరివు
8-30 Matters of Moment (relay from Delhi)
8-45 వాద్య సంగీతము †
9-00 హెచ్. వై. నారాయణన్
9-30 హిందీ సంగీత రూపకం (ఢిల్లీనుండి రిలే)
11-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211·3 మీ (1420 కిలోసైె)
49·30 మీ (6085 కిలోసైె)

6-45 మద్రాస్ ఎ వలె
7-0 తెలుగులో వార్తలు**
7-15 సంగీతమంజరి †
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 మద్రాస్ ఎ వలె
9-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211·3 మీ (1420 కిలోసైె)
41·32 మీ (7260 కిలోసైె)

10-45 ఆటవిడుపు పిల్లల మ్యాగజైన్ కార్యక్రమము నిర్వహణ; సి. ధనలక్ష్మి
11-30 కళారంగము మలయాళమున కార్యక్రమము
12-00 హూమాళె కన్నడమున కార్యక్రమము
12-30 సూర్యకాంతి (తిరుచ్చినుండి రిలే)
1-00 వాద్యగోష్ఠి
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 తేవారం
1-50 తెలుగులో వార్తలు*
2-00 మధుర గీతము †
2-10 పాపామలర్ పిల్లలకు (తమిళము)

## విజయవాడ

357·1 మీ (840 కిలోసైె)

ఉ॥ ప్రసారము I

6-30* శుభోదయం
6-35 భక్తిరంజని; వెంకటాద్రి కీర్తనలు నిలయవిద్వాంసులు
6-55 ప్రసార విశేషాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
7-30 అమరవాణి సంస్కృత కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే)

3-00 సేలం జి. దేశికన్ వి. సేతురామయ్య; వయొలిన్ పాల్ఘాట్ కె. కుంజుమణి; మృదంగం
4-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211·3 మీ (1420 కిలోసైె)
60·98 మీ (492) కిలోసైె)

5-30 పాశ్చాత్య సంగీతము †
5-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరణ (తమిళం)
6-20 కదంబం †
7-00 తెలుగులో వార్తలు**
7-15 వాద్యగోష్ఠి
7-30 మద్రాస్ ఎ వలె
8-00 మద్రాస్ ఎ వలె
8-30 తిరుప్పాప్పులియూర్ వి. రాజు; వయొలిన్
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 U. N. Speaks
9-30 వాద్యగోష్ఠి
9-45 పాశ్చాత్య సంగీతము †**
10-30 ప్రసార సమాప్తి

## మద్రాస్-సీ

193·5 మీ (1550 కిలోసైె)
వివిధభారతి (రిలే)

(వివరాలు 56-వ పేజీలో)

*షార్ట్‌వేవ్‌పైగూడా వినవచ్చును
** మీడియంవేవ్‌పై మాత్రం

7-45 త్యాగరాజ కృతి సమూహ్యాయం; డి. పశుపతి
8-00 ఆంగ్లమున వార్తలు
8-10 హిందీలో వార్తలు
8-20 పాలవెల్లి పిల్లల కార్యక్రమము
9-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30 సాతూర్ ఏ.జి.సుబ్రహ్మణ్యం
1-00 అలీ హుస్సేన్, బృంద; శహనాయ్
1-30 లలిత సంగీతం; పి. సూర్యారావు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00 కంఠాభరణము నాటిక రచన; కీ. శే. పానుగంటి లక్ష్మీ నరసింహారావు రేడియో అనుసరణ; బందా కనకలింగేశ్వరరావు
4-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థుల కార్యక్రమము శ్రీ కృష్ణ తులాభారం రంగస్థల నాటకమునుండి ప్రకటనలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము సామాన్యుని స్వగతాలు రచన; శ్రీరామకవచం సత్యనారాయణ
7-30 కల్పలత- శ్రోతలుకోరిన పాటలు
8-00 కె. కృష్ణన్; వేణువు డి. పాండురంగరాజు; వయొలిన్ జె. సింహాచలశాస్త్రి; మృదంగం
8-30 Matters of Moment (relay from Delhi)
8-45 కె. కృష్ణన్; వేణువు
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 లలిత సంగీతము; పి. సూర్యారావు
9-30 టి. బృంద, టి. ముక్త
10-30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ‡ టేపు రికార్డింగ్

శనివారం మార్చి 31
శ 1884 చైత్ర 10

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలోసైకిళ్ళు)

ఉ॥ ప్రసారము I

6-45 మంగళగానం
6-50 తుదిప్పాడల్‌గళ్
7-00 వాద్యగోష్ఠి•
7-10 నేటి కార్యక్రమ వివరణ వాతావరణసూచన (తమిళం)•
7-15 తమిళమున వార్తలు
7-30* కె. పి. శివానందం, సి. ఆర్. శారద ‡
7-45 రేడియో న్యూస్‌రీల్ వార్తాసమీక్ష (తమిళం)
8-00 మధుర గీతం †
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

416·7 మీ (720 కిలోసైకిళ్ళు)

1-00* కదంబం †
1-30 గానమంజరి †
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి †•
2-00 తమిళమున వార్తలు
2-10 వయొలిన్: నిలయవిద్వాంసుడు
2-30 ఎన్.వి.నారాయణభాగవతర్ ‡ (ముత్తయ్యభాగవతర్ కృతులు)
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

416·7 మీ (720 కిలోసైకిళ్ళు)

5-50* ఆర్. పిచ్చుమణి
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే) (7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పై గూడ)
7-15 తమిళమున వార్తలు
7 30* తిరువత్తూర్ చెల్లమ్మాళ్
8-00 జి. లక్ష్మణన్: వీణ
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీతం †
8-45 వాద్యగోష్ఠి
9-00 అందాదులు ‡
9-15 మధుర గీతం †
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము
గుజరాత్ ప్రాంతపు సంగీతం (ఢిల్లీనుండి రిలే)
11-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211 3 మీ (1420 కిలోసైకిళ్ళు)
49 30 మీ (6085 కిలోసైకిళ్ళు)

6-45 మద్రాస్ ఎ వలె
7 00 తెలుగులో వార్తలు**
7-15 సుప్రభాతం సంస్కృత కార్యక్రమము
వేణీ సంహారము నాటిక (సంస్కృతం) 1-వ అంకం
7-30 మద్రాస్ ఎ వలె
7-45 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

211·3 మీ (1420 కిలోసైకిళ్ళు)
41·32 మీ (7260 కిలోసైకిళ్ళు)

1-00* మద్రాస్ ఎ వలె
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 గీతమంజరి †
1-50 తెలుగులో వార్తలు**
2-00 మధురగీతం †
2-10 ముత్తువిక్కుడియిల్ పిళ్ళైకు (తమిళం)
3-00 For Children arranged by Mrs. W. M. Calvert Conducted by Uncle Handel
3-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

211 3 మీ (1420 కిలోసైకిళ్ళు)
60 98 మీ (4920 కిలోసైకిళ్ళు)

5-20* పాశ్చాత్య సంగీతం †
5-50 స్థానిక ప్రకటనలు, వాణిజ్య వార్తలు (ఆంగ్లం)
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరణ(తమిళం)
6-20 పి. విశ్వనాథరావు: వేణువు
7-00 తెలుగులో వార్తలు**
7-15 సంగీతమాల †
7-30 పిరలాట్టిన్ సంద్రు నాటక (తమిళం) (తిరుచ్చినుండి రిలే)
8-00 మద్రాస్ ఎ వలె
8-30 తిరుప్పావై వాయిల్ శ్రీనాథన్
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 Book Review by K A Nilakanta Sastri
9-25 వాద్య సంగీతం †
9-30 పాశ్చాత్య సంగీతం**
11-00 ప్రసార సమాప్తి

## విజయవాడ

357 1 మీ (840 కిలోసైకిళ్ళు)

ఉ॥ ప్రసారం I

6-30* శుభోదయం
6-35 భక్తిరంజని: వెంకటాద్రిస్వామి కీర్తనలు ద్వారం భావనారాయణరావు సుసర్ల శివరాం పి. సూర్యారావు
6-55 ప్రసార వివేశాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతం శిక్షణ
7-30 ద్వారం సత్యనారాయణ మూర్తి: వయొలిన్
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

12-30* కార్మికుల కార్యక్రమం (హైదరాబాద్ నుండి రిలే)
1-00 వనితావాణి స్త్రీల కార్యక్రమం
యమునాతీర సైకతములో నారాయణ రెడ్డి గేయం
జానపద గేయాలలోని అంతరార్థము
సామెతలు - పొడుపు కథలు ప్రసంగం కనుపర్తి వరలక్ష్మమ్మ
శ్రోతల ఉత్తరాలు
మంగళం
1-30 లలిత సంగీతం †
1-50 తెలుగులో వార్తలు
2-00 బొమ్మరిల్లు పిల్లల కార్యక్రమం
రారండి రారండి
సంగీత శిక్షణ
తపాల సంచి
కథల్లో కథలు: దశకుమార చరిత్ర రూపకం
చూచివద్దాము: నాగార్జున సాగర్
మనపాట; చిలకపలుకులు
సెలవు
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థుల కార్యక్రమం రంగస్థల కార్యక్రమము మార్కెట్ సమీక్ష ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమం విశేషమేమిటి చేయంగల విన్నపాలు
7-30 క్రీడారంగ సమీక్ష ఎమ్. జానకిరామయ్య
7-40 విరామ సంగీతము
7-45 మధుమాస్ సంగీత రూపకం (హిందీ) రచన: ఆర్. నరసింహమూర్తి
8-00 Devolopment Forum discussion
8-15 ఫిల్మ్ సంగీతం †
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 విరామ సంగీతం †
8-45 హైదరాబాద్ వలె
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 నాటిక (హైదరాబాద్‌నుండి రిలే)
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం గుజరాత్ ప్రాంతపు సంగీతం (ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193 5 మీ (1550 కిలోసైకిళ్ళు)
వివిధభారతి (రిలే)

[వివరాలు 56 వ పేజీలో]

• షార్ట్‌వేవ్‌పై గూడా
** మీడియమ్‌వేవ్‌పై మాత్రము



† గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డు

శనివారం మార్చి 31

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారం I

405.4 మీ (740 కిలోసైౖ)

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని
(విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
(విజయవాడనుండి రిలే)
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 బృందగానం
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

2-30* కార్మికుల కార్యక్రమం
బ్రతుక నేర్చినవారు
నాటిక
రచన : ఎన్. రాఘవరావు
వార్తావాహిని ;
సినీగీతి †
1-00 వనితావాణి
(విజయవాడనుండి రిలే)
1-30 లలిత సంగీతం :
జి. కృష్ణమూర్తి
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారం III

3-45 బాలానందం
పిల్లల కార్యక్రమం
రారండి
కాగితము లేని చదువు
పండ్లతోటలో ; మామిడి
మామిడమ్మా మామిడి పాట
పుట్టినరోజు జేజేలు ;
మీ పక పకలు
4-45 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 కన్నడ శ్రోతలకు
7-00 తెలుగులో వార్తలు
7-15 ఆధ్యాత్మ రామాయణ్ కే
స్తోత్ర ప్రసంగ్: శబరీ స్తవన్
ఉదాహరణాత్మక ప్రసంగం (హిందీ)
7-30 ప్రసంగం
(విజయవాడనుండి రిలే)
7-40 ప్రసంగం (ఉర్దూ)
7-50 విరామ సంగీతం
7-55 శ్రోతలఉత్తరాలకు జవాబులు
(హిందీ)
8-00 State Development forum
8-15 వాద్య సంగీతం †
8-30 Radio News Reel
8-40 విరామ సంగీతం
8-45 చెప్పుకోదగ్గ వార్తలు
వార్తాసమీక్ష
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 అఖిలభారత సంగీత
కార్యక్రమం
గుజరాత్ ప్రాంతపు సంగీతం
(ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారం I

60.12 మీ (4990 కిలోసైౖ)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారం I (తరువాయి)

42.02 మీ (7140 కిలోసైౖ)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

42.02 మీ (7140 కిలోసైౖ)

12-30* హైదరాబాద్ ఎ వలె
2-00 ఎన్. శ్రీనివాసశర్మ :
వయొలిన్
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారం III

3-45 హైదరాబాద్ ఎ వలె
4-15 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం IV

60.12 మీ (4990 కిలోసైౖ)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమం
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమం
7-30 హైదరాబాద్ ఎ వలె
7-40 ప్రాదేశిక్ సుగం సంగీత్
8-00 హైదరాబాద్ ఎ వలె
9-15 అమృతవర్షిణి
సంగీతరూపకం
రచన, నిర్వహణ ; రజని
9-30 హైదరాబాద్ ఎ వలె
11-00 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## బెంగుళూరు

491.8 మీ (610 కిలోసైౖ)

ఉ॥ ప్రసారం I

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరణ,
మేళగాన
7-15 టి. ఆర్. శుభాంగి
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 సి. కె. తార : కన్నడపాటలు
8-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

12-00* హెచ్. వి. కృష్ణన్ :
వయొలిన్
12-30 బాలజగత్
1-10 కన్నడమున వార్తలు
1-20 రాజలక్ష్మి శ్రీనివాసన్ ;
దేవరనామ
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 రాజలక్ష్మి శ్రీనివాసన్ ;
దేవరనామ
2-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 రాజలక్ష్మి శ్రీనివాసన్ ;
దేవరనామ
6-20 సుగం సంగీత్
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 జి. చెన్నమ్మ
వాద్యబృందంసహ
8-30 Radio News Reel
(relay from Delhi
8-40 వాద్యసంగీతం †
8-45 గానసుధ †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 నన్న మెతె ప్రభావబీరిద
పుస్తకగళ
ప్రసంగం (కన్నడం
డి. ఆర్. బెంద్రే
9-25 లలిత వాద్య సంగీతం †
9-30 అఖిలభారత సంగీత
కార్యక్రమం
గుజరాత్ ప్రాంతపు సంగీతం
(ఢిల్లీనుండి రిలే
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319.1 మీ (940 కిలోసైౖ)

ఉ॥ ప్రసారం I

6-45* మంగళగానం
6-50 భక్తిగీతాలు
7-00 వాద్య సంగీతం
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళములో వార్తలు
7-30 చిదంబరం ఎస్. రామానుజం
వయొలిన్
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్ల)
8-00 ఆంగ్లములో వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారం II

1-00* భక్తిగీతాలు
1-20 పిల్లలకు (తమిళం)
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతం
2-00 తమిళములో వార్తలు
2-10 చిదంబరం ఎస్.రామానుజం;
వయొలిన్
2-45 వాతావరణం సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారం III

4-45* వివిధభారతి
5-45 సంగీత పాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళములో వార్తలు
7-30 పరలాట్రిన్ సంద్రు
నాటిక (తమిళం)
8-00 చిత్రగానం †
8-30 Radio News Reel
8-40 సంగీతమాల †
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 Medical Science on the march - X - Rays
talk by
P. N Krishna
9-30 అఖిలభారత సంగీత
కార్యక్రమం
గుజరాత్ ప్రాంతపు సంగీతం
(ఢిల్లీనుండి రిలే)
11-00* ప్రసార సమాప్తి

(2-వ పేజీ తరువాయి)

సప్తశతీ—సాహిత్య క్షేత్రమును పరిపాలించినవి నన్నయ భట్టు "తెలుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్" అను వాక్యము విశ్వశ్రేయః కావ్యమ్ అను ఆంధ్ర శబ్ద చింతామణి ప్రారంభ సూత్రము—నన్నె చోడుడు పేర్కొనిన దేశికవితో[illegible]మును ఒకే కృతితో వి[illegible]స్తాయి. నన్నయ వ్యక్తిగతమైన ప్రతిభ— అంతవరకు సాగుతున్న ఒక సాహిత్య ప్రవాహానికి అనకట్ట వేసి క్రొత్తకాలువలు త్రవ్వి ఊసర క్షేత్రాలను సస్యశ్యామలం చేసింది.

## నన్నయ ప్రతిభ

ఆంధ్ర వాఙ్మయంలో ఆది కవితా ప్రాతః స్మరణీయుడై నిలిచిన నన్నయభట్టు సర్వతో ముఖ ప్రతిభావంతుడు- నన్నయభట్టు ఆంధ్ర మహాభారతం సంస్కృత శ్లోకంలో ఆరంభించాడు, అతడు వ్రాసిన నందంపూడి శాసన భాష సంస్కృతం నన్నయ భట్టు సంస్కృత సంప్రదాయాలలో పుట్టి పెరిగినవాడు కావటంచేత- అటు సంస్కృత సంప్రదాయాలను చాలవరకు తెలుగులోకి ప్రవేశపెట్టాడు ఆనాడు ఆ సంస్కృత సంప్రదాయాలను మలచి తెలుగులో ప్రవేశపెట్టవచ్చుననీ, తెలుగున మహాభారతము వినిర్మింపవచ్చుననీ, ఊహించుకోవటం ఒక మహా ప్రతిభావంతుడికి మాత్రమే సాధ్యం. నన్నయ భారతం కూడ ఒక విధంగా క్రొత్తపాతల మేలి కలయికయే, నన్నయ శబ్దశాసనుడు. సంస్కృతంపై వ్యాకరణం వహింపకల్గిన ప్రభుత్వం-ప్రవాహినియైన దేశ భాషపై వహించటం కష్టం. అయినా నన్నయ ప్రతిభ శబ్దశాసనత్వంగా పరిణమించినది.

ఛందస్సులో నన్నయ అటు సంస్కృత ఛందో సంప్రదాయాలు-ముఖ్యంగా ఉత్పలమాల చంపకమాల మత్తేభ శార్దూల వృత్తాలు, సీసం, ఆటవెలది తేటగీత కందము తరువోజ మధ్యాక్కర మొదలైన తెలుగు ఛందస్సులు, నన్నయ తీర్చి దిద్దిన ఒరవడులే నేటివరకూ తెలుగు కవులు అనుసరిస్తున్నారు. నన్నయ ఛందస్సుగూడ క్రొత్త పాతల మేలి కలయికయే. ఇక సంప్రదాయానికి అతీతంగా కేవలం నన్నయ ప్రతిభ మాత్రమే అని చెప్పదగినది. ఆ మహాకవి మాటలలోనే చెప్పవలెనంటే, ప్రసన్న కథా కవితార్థ యుక్తి, అక్షర రమ్యత.

సంఘంలోనూ సాహిత్యం లోనూగూడ మొదట జగద్ధితం, విశ్వశ్రేయం. సాధించటానికి ఏర్పడిన సంప్రదాయాలే కాల దోషంపట్టి జగత్తునకు అహితం అవిశ్వశ్రేయం కావచ్చు. కాని తరువాతివారు ఆ సంప్రదాయా లను పట్టుకొని వదలలేరు, ఇంకో ప్రతిభావంతుడు ఉద్భవించేవర కూ. పాల్కురికిసోమన వ్యక్తిగత ప్రతిభ పేర్కొనదగినది. అతడు నన్నయభట్టు పెట్టిన ఒరవడికి అగాధ గద్యపద్య సంస్కృత భూయిష్ఠరచనను భిన్నంగా ఒక మహోద్యమం లేవదీశాడు. అదే జానుతెనుగుదేశకవిత నాటినుండే ద్విపదకవిత ప్రత్యేక శాఖగా తెలుగులో వెల్లివిరిసింది.

## సోమనాధుని కోడికూత

ఆంధ్ర వాఙ్మయంలో రావ లసినంత కీర్తి రానట్టి దురదృష్ట వంతులలో అగ్రగణ్యుడు పాల్కురికి సోమనాధుడు అతడు చరిత్రలో అటు నన్నయ ఇటు తిక్కన ఇద్దరు మహాకవుల మధ్య పడ్డాడు. చంద్రాస్తమయా నికి సూర్యోదయానికీ మధ్య ఉదయించిన అతి అలతి కాంతులు ఎంత నిసర్గ రమణీయములైనా లోకం చక్కగా దర్శింపలేదు. జాను తెనుగు దేశకవిత ఉద్యమా లతోపాటు అతని చేతిలో స్వభా వోక్తి సిద్ధి పొందింది. బసవ పురాణంలో అతడు వర్ణించిన కోడికూత సాహిత్య విద్రావవు లను నేటికీ మేల్కొలుపుతూనే వుంటుంది.

తిక్కన నన్నయభట్టు ఆరం భించిన మహాభారతం పూరిం చినా, పాల్కురికి సోమనాథుల జానుతెనుగు, దేశకవిత ఉద్యమం లోని సారం గ్రహించకపోలేదు. తిక్కన తనకు పూర్వం వెల్లి విరిసిన సాహిత్య సంప్రదాయా లను సమన్వయించిన ధర్మా ద్వైతమూర్తి అంతేగాక, తిక్కన వ్యక్తిగత ప్రతిభతో ఒక వినూత్న కవితారీతి నాటకీయ రీతి స్థాపించిన మహాకవి,

నాటకీయతకు ప్రధానాంశము ఇది చెప్పదగిన అంగికాభినయ వర్ణన, సంభాషణాచాతురి, పాత్ర నిర్మాణ చాతురి, మనోధర్మ పరి జ్ఞానము తిక్కన వ్యక్తిగత ప్రతి భకు విదర్శనములు.

## తిక్కన నవ్వులు

తిక్కన సజీవపాత్ర చిత్రణ నవీనగుణసనాధుడను బిరుదు వహించిన నాచన సోమునికి గురుత్వం వహించింది. అంగికాభి నయంలో అంతర్భాగమే అయినా తిక్కన చిత్రించిన నవ్వులు పేర్కొనదగినదగినవి. అగాధ హృదయ విషయసూచికగా నవ్వును తిక్కన ప్రయోగించిన ట్లు మరియే తెలుగు కవిగూడ ప్రయోగింపలేదు. ఊర్వశీ పరశా మురల సంభాషణ వరూధుని ప్రవరాఖ్యుల సంభాషణ ఇవి అన్నీ ఆ ప్రతిభా సమన్వితములే అయినా తిక్కన స్థాపించిన సంప్రదాయం ప్రభావంసుగమం. నాచనసోముని తరువాత తిక్క నకు పరోక్ష శిష్యుడుగా పేర్కొ దగినవాడు పింగళి సూరన, నేటికి గూడ తిక్కనను అనుసరించే కవులున్నారు, ప్రతిభకు నిర్వి కల్ప విదర్శనం తరువాతి తరాల వారిపై ప్రభావం ప్రసరింప జేయడమే

## శ్రీనాధుని సీసాలు

తెలుగు కవులలో ప్రతిభా వ్యుత్పత్తుల రెండు గంగా యము నల వలె సంగమించినవాడు శ్రీనాధుడు. శ్రీనాధుడు తీర్చిన సీసపు ఒరవడి నేటికీ నిలిచి ఉంది శ్రీనాధుని సీసాలు పెద్దన వంటి మహాకవికే ఉజ్జలంతులు అయాయి. పోతనకు సహజ పాండిత్య భూషణుడు అనే బిరుదు కన్పిస్తోంది. దీని అంతరార్థం అనుశీలింపదగింది, అంటే ఈతనిది నేర్చుకున్న సాహిత్యం కాదు. ఇతరులు ప్రయత్న పూర్వ కంగా అనుప్రాసను అలంకారం గా ప్రయోగించవచ్చు. పోతనకు అది నిసర్గంగా అలవడిన కళ "హారికి నందగోకులవిహారికి, చక్రసమీర దైత్య సంహారికి, గోపనితంబినీ మనోహారికి...." "స్వస్త్రిజగత్త్రయీభువన శాసన కర్తకు, హాసమాత్రవిధ్వ స్త నిలింప భర్తకు, నిరరీగళత్రస్త సువర్ణ సూత్రపరిహర్తకు".

అంటే ప్రతి కవికీ, ఒకవిధ మైన వ్యక్తిగత ప్రతిభ ఉం టుంది. ఎన్నో విషయాలలో ఎందరో కవులకు అతడు పరోక్ష శిష్యుడైనప్పటికీ ఆ ఒక్క విష యంలో అతడు తన తరువాతి వారికి విద్యాగురువు అవుతాడు. ఒక్క ఛందో విషయంలో తీసు కుంటే క దానికి తిక్కన, సీసా నికి శ్రీనాధుడు, ఆటవెలదికి వేమన, శార్దూలానికి ధూర్జటి.

అల్లసాని వాని అల్లిక జిగిబిగి
ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగ విభుని పద
గుంభనములు

జగత్ ప్రసిద్ధాలు-దీనికితోడు వను చరిత్రకారుని శ్లేషగూడ చేర్చక తప్పదు. ఈ కవులం దరూ ప్రాచీన సాహిత్య సంప్ర దాయాలను అనుసరిస్తూనే, ఏదో ఒక వ్యక్తిగత ప్రతిభా ముద్ర వాఙ్మయంలో వేసిపోయిన వాళ్లే

## ఎవరిగొంతుక వారిదే

ఆంధ్రవాఙ్మయంలో స్వర్ణ యుగం అని సాహిత్య చరిత్ర కారులు ఉగ్గడిస్తున్న రాయల యుగంలో ఒకేయుగంలో ఒకే సారి పెక్కుమంది ప్రతిభావం తులు ఉద్భవించారు అందరికీ స్ఫుటమైన గొంతుకలు ఉన్నాయి. ఎవరిగొంతుక వారిదే మలభంగా గుర్తుపట్టవచ్చు విశేషం ఏమి టంటే, అష్టదిగ్గజాల మధ్యభువన

విజయ సభాభవనంలో అధ్యక్ష స్థానం వహించిన శ్రీకృష్ణదేవరాయలవారి గొంతుకగూడ స్పష్టంగా గుర్తుపట్టదగినది. 'ఉపమా కాళిదాసస్య' అని సంస్కృతంలో ఉంటే ఉత్ప్రేక్ష అముక్తమాల్యదాకారుని సొత్తు అనక తప్పదు.

## కొత్తపుంతత్రొక్కినవాడు

ప్రబంధ యుగంలో కొన్ని కొత్త సంప్రదాయాలు స్థాపించబడ్డాయి. కావ్యానికి ఆద్య కాల సందుకొని ఏకైకంగా ప్రవహించే వస్త్వైక్యం పురాణకథను గ్రహించి అష్టాదశ వర్ణనలతో పెంచి పెద్ద ప్రబంధంగా వ్రాయటం— ఇవి ఆనాటి సంప్రదాయాలు. ఆ సంప్రదాయాలను ఆనాటి కవులందరూ పాటించినవాళ్లే. పింగళి సూరన స్వకపోల కల్పితమైన ప్రబంధం కళాపూర్ణోదయం వ్రాస్తే సమకాలీనులు కొందరు 'కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములు' అని మూతిముడిచిన వారు లేకపోలేదు. అంటే పింగళి సూరన ఆనాటి ప్రతిభ ప్రదర్శించి కొత్త పుంతత్రొక్కినవాడు అని చెప్పటం మాత్రమే— క్రొత్తదనం ప్రతిభకు ఏవిధంగా నిదర్శనమో. కేవలం అనుకరణ ప్రతిభాహీనతకు నిదర్శనం అని అన్పించవచ్చు.



## ధూర్జటి ఈశ్వరారాధన

ఆ ప్రబంధయుగంలో వ్యక్తిగత ప్రతిభకు 'ఉజ్జ్వలోదాహరణం' ధూర్జటి మహాకవి. ప్రబంధాలలో అష్టాదశ వర్ణనలలో ప్రాయికంగా ప్రాణం ఉండదు. పురవర్ణన మొదలైనవి ఉదాహరణలుగా స్వీకరించవచ్చు. అవి కేవలం అనుకరణాలు, ప్రతిధ్వనులు మాత్రమే. కాని ప్రతిభావంతుడైన ధూర్జటికవి చంద్రోదయ వర్ణనం ఇందుకు భిన్నం.

ఉదయ గ్రావము సానవట్ట
మభిషేకోద ప్రవాహమ్ము వా
ర్ధి దండ్యాగతము ధూపము
జ్వలద్దీప ప్రభారాజి కొ
మ్ముసితారావళు లర్పిత
సుమంబుల్గా తమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తి శివలింగం
బొప్పె పాటిదిశన్.

సర్వ ప్రకృతీ ఈశ్వరారాధనగా సాక్షాత్కరించింది ధూర్జటికే. ఈశ్వరారాధనలో చంద్రుడు శివలింగమై ఉదయాద్రి పానవట్టమై సముద్రజలము అభిషేకోదకమై చీకటి ధూప ధూమము నక్షత్రములు పూజా పుష్పములు.

## అదృష్టం

ఆధునికయుగంలో ప్రతిభను వెన్నెలదేవళంకట్టి ఆరాధించే పలువురు ఉద్భవించటం ఆంధ్ర వాఙ్మయంయొక్క అదృష్టం.

నన్నయభట్టు నుండీ నేటివరకూ
క్రొత్త సంప్రదాయాలు
స్థాపించటం అనే ప్రాచీన
సంప్రదాయం అవిచ్ఛిన్నంగా
సాగుతోంది ఎప్పటికప్పుడు.
క్రొత్తపాతల మేలికలయికే
తెలుగు దనంగా వెల్లివిరిస్తోంది.

# గృహపరిశ్రమలు: అగర్‌బత్తీ చేయుట

కె. సుగుణమణి

గృహపరిశ్రమ అంటే యంత్రాలు కర్మాగారాలు అక్కర లేకుండా మహా ఉంటే పదిమంది ఎక్కువ వారికన్నా ఎక్కువ లేకుండా చిన్నచిన్న పనిముట్లతో మనకు కావలసిన అవసర వస్తువులు, మనమే తయారుచేసుకొనే కుటీర పరిశ్రమలని అందరికీ తెలిసిందే. ఎప్పుడైతే యంత్రాలచేత ఈ పనులు చేయించడం ప్రారంభించారో అప్పట్నుంచీ మన గృహ పరిశ్రమలు నశించిపోవడం మొదలెట్టాయి. గాంధీజీ పుణ్యమా అని, ఇప్పుడు మళ్ళీ మన కుటీరపరిశ్రమలన్నీ పునరుద్ధరింపబడి, మనలో అనేకమంది బీదవారికి, మధ్యతరగతి కుటుంబీకులకు చేతినిండా పని దొరుకుతూ వుంది. వారు తమ తమ సామర్థ్యాన్నీ, బుద్ధికుశలతనూ, నైపుణ్యాన్నీ చూపించి, బ్రతుకు తెరువు చూచుకొందుకు, తాము భార్యా బిడ్డలతో సుఖంగా బ్రతకడానికి వీలు యేర్పడుతూ వుంది.

## కొన్ని గృహపరిశ్రమలు

మచ్చుకు చెప్పాలంటే మన గృహ పరిశ్రమలు కొన్ని—నూలు వడకడం, బట్టలు నేయడం, అద్దకం, లేసు అల్లిక, ఎంబ్రాయిడరీ, పట్టు పరిశ్రమ, కంబళ్ళ నేత, పీచు పరిశ్రమలు, కాగితం తయారీ, కర్ర పనులు, లక్క పనులు, లోహపు పరిశ్రమలు, వడ్రంగం, కమ్మరం వెదురు—పేము పనులు, బుట్టలు-తట్టలు అల్లడం, విస్తళ్ళు కుట్టడం, పలకలు తయారుచేయడం, గ్లాసు-పింగాణీ పనులు, మట్టి బొమ్మలు, దంతం పనులు, అగ్గిపుల్లల తయారీ, నూనె గానుగలు, దంపుడు బియ్యం, తేనెటీగల పెంపకం, అగర్ వత్తులు చేయడం—ఇలా ఒకటేమిటి మనకు నిత్యజీవితంలో అవసరమైన వస్తువులన్నీ మన దేశస్థులే ఉత్పత్తి చేయడమన్నమాట.

## రక్తపాతంలేని గొప్ప విప్లవం

ఇలా మన అవసర వస్తువులు మనమే గృహపరిశ్రమలుగా ఉత్పత్తి చేసుకోవడంలో ఎంతో ఆర్థికతత్వం ఇమిడి వుంది. అన్న వడికితే ఆదాము నేస్తే అంతా బట్టేను ఈ పద్ధతిపోయి, పరదేశాలమీద, యంత్ర రాక్షసులమీద ఆధారపడ్డం మొదలెట్టినప్పుడే దేశానర్థం ప్రారంభమైంది. ఈ రోజున, దేశనాయకుల పుణ్యమా అని, మనమే మళ్ళీ విదేశాలకు మన వస్తువుల్ని పంపే స్థితిలోకి వచ్చాము. ఇది నిజంగా రక్తపాతం లేని గొప్ప విప్లవం. మనకూ తదితరులకూ ఇది ఎంతో సుఖం చేకూర్చింది, చేకూరుస్తుంది. ఐతే ఇంకా కొన్ని ఇబ్బందులున్నాయి.

## సుఖజీవనానికి తోడ్పాటు

తీరిక కాలంలో గొప్ప యింటి గృహిణి దగ్గరనుంచి, నిత్యజీవనం గడవని వితంతువువరకూ ఏ ఎంబ్రాయిడరీయో ఏ లేసు కుట్టుపనో, ఏ వడియాలు, అప్పడాలు, ఊరగాయలు వంటివో తయారీ చేయగలరు. కాని వాటిని స్వయముగా అమ్ముకుంటే నామోషీ అనే అభిప్రాయాల్లో ఉంటున్నారు. అందుచేత స్త్రీల సంస్థలో, ఆయా పనివాళ్ళ సహకార సంస్థలో పూనుకొని, వారికి కావలసిన ముడి పదార్థాలు టోకున కొని, స్టాకుచేస్తే సులువుగా సప్లయి చేయడం, ఉత్పత్తియైన సరుకులు ఏ ఎంపోరియాల్లోనో వుంచి, అమ్మిపెట్టి, వచ్చిన డబ్బు ఆ సరుకులు ఉత్పత్తి చేసుకొన్న వారికి అందచేయడము, మొదలగు సౌకర్యాలు కల్పిస్తే. ఈ గృహ పరిశ్రమలు ఇంకా విరివిగా జీవనోపాధిగా అవలంబించడంలోను, తయారు చేసుకొన్న సరుకులు విక్రయించుకోవడంలోను వుండే ఇబ్బందులు తొలగి, ఎందరెందరికో సుఖ జీవనానికి తోడ్పడి. వారు భార్యా బిడ్డలతో సుఖంగా గౌరవంగా బ్రతకడానికి వీలవుతుంది.

## సన్నిహిత సంబంధం

మన నిత్యజీవితంలో నిత్యోపయోగమైన అవసరాల్లో అగర్‌బత్తీ ఒకటి గదా. మనము చేసేది ఒక పెళ్ళి కానీండి, కావ్యం కానీండి, ఏ శుభ-కార్యానికైనా, పూజా పునస్కారానికైనా సభ-సంస్కారానికైనా అగర్‌బత్తి ఉండితీరవలసిందే. పొద్దున దేవతార్చన పూజ దగ్గరనుండి రాత్రి [illegible] వరకు అగర్‌బత్తి అంటించి, ధూప దీప నైవేద్యాలతో కార్యక్రమము నడిపిస్తాము. మన పరిసర వాతావరణానికి పరిమళం కల్పించి ముక్కు ద్వారా మనస్సుకు ఉల్లాసం కలిగించే పరిమళ ద్రవ్యాల్లో అగర్‌బత్తి ప్రముఖ స్థానం వహిస్తుంది. దేవుణ్ణి ఆహ్వానించడానికీ, దోమల్ని పారద్రోలడానికీకూడ మనకు పనికివస్తూ వుంది. వెలిగి కాలుతూ తమాషాగా మన ప్రార్థనలూ ఊహాలులాగే ఆకాశంలో విహరించే అగర్‌బత్తీ ధూపానికీ మనకు యింత సన్నిహిత సంబంధం ఉండడం సమంజసంగానే వుంది. అదీకాక అగర్ బత్తీలకు ఎప్పుడు ఎక్కడా కూడా డిమాండు ఉంటుంది. అమ్ముడు కావేమోనన్న భయం లేదు. నిలవుంచే పాడయ్యే సరుకూ కాదు.

## తయారుచేసే విధం

వీటి తయారీలో చాలా పద్ధతులున్నాయి. అనేక రకాల పరిమళ ద్రవ్యాలు కలుపుతారు. ఖరీదైన సరుకులు వాడేకొద్దీ వాటి నాణ్యమూ, ఖరీదూ హెచ్చుతూ వుంటుంది. సాధారణంగా ఇంట్లో చేసుకొందుకు వీలైన విధానాలు ముందుచెప్పి. ఖరీదైన వాటి సంగతీ, అగర్‌బత్తీ కంపెనీలు, వాణిజ్య సరళితో చేసే వాటి సంగతీ ఆఖరున ఉదహరిస్తాను.

కావలసిన సరుకులు :—

1 మసిబొగ్గు పొడి, మెత్తగా చేసిజల్లించింది 100 పాళ్లు
2 మంచిగంధచెక్కపొడి 20 ,,
3 సూరేకారం, పొటాసియం నైట్రేట్‌ని టపాకాయలలో వాడేది. 10 ,,
4 సాంబ్రాణిగాని, గుగ్గిలంగాని (పొడుం) 5 ,,
5 తుమ్మజిగురుగాని అరపూసగాని 1 పాలు
6 సెంటు లేక కస్తూరి సువాసనకి మోతాదుగా వెయ్యాలి.

చేసేపద్ధతి:—వీటిని కలిపి మోతాదుగా నీళ్ళతో చపాతీ ముద్దలాగ చేసి తయారుగా ఉంచుకోవాలి.

ఇంకా చపాతీలు చేస్తున్నప్పుడు చల్లినట్లుగా వాడటానికి సూర్యాపౌడరు అని అంటే గులాబీ, చెంబేలీ వంటి పూలరేకుల పొడి, తీసుకోవాలి. సన్నగా చీల్చి క్రిందిభాగం 1-2 అంగుళాలు ఎర్రరంగులోనో, పచ్చ రంగులోనో ముంచివుంచిన పుల్లలు సిద్ధంగా వుండాలి. ఒక గుప్పెడో, పందో చేసే ఓపికకొద్దీని, వత్తులు చేయడానికి నున్నటి పీట ఒకటి. ఆ ముద్ద కొద్దికొద్దిగా తీసుకుని పీటమీద సూర్యాపౌడరు అద్దుతూ బత్తీలు చెయ్యాలి. తయారైన వెదురు పుల్లలకు పట్టేలాగ పీటమీద అరచేతిక్రింద దొర్లిస్తూ అగర్‌బత్తీలు చెయ్యాలి. తయారైన పుల్లలు నీడను ఆరనివ్వాలి, ఆరిన తర్వాత తిరిగి ప్రతీ పుల్లకూ కొద్దిగా సెంటో, కస్తూరో పూస్తే మంచి సువాసనతో ఆకర్షించే వాసన పుల్ల వెలిగించిన వెంటనే గుమ్ముమని వాసనా వస్తాయి. తయారయిన అగర్‌బత్తీలు వాసన పోకుండా రంగు రంగుల సెలోఫేన్ పేపర్లతో పేకింగ్‌చేసి వాడుకోడానికైనా, అమ్మకానికైనా సిద్ధము చెయ్యాలి.

## నాణ్యమైనవీ, ఖరీదైనవీ

ఇంకా నాణ్యమైనవీ ఖరీదైనవీ కావాలంటే పిలారిస్, కుంకుంపువ్వు. దాల్చినచెక్క, ఏలకపొడి, వట్టివేళ్లు, తేనె, రకరకాల సెంట్లు, చందన తైలం, అసలైన కస్తూరి, అగర్ నూనె వగైరా పరిమళ ద్రవ్యాలు వాడాలి. కంపెనీల్లో చేసేవారు ఈ ముద్ద ఉడికించి రోజులకొద్దీ ఊరనిచ్చి, విరివిగాచేసి, అప్పుచేసిన ఆకర్షవంతమైన అట్టపెట్టెలు, తేత గొట్టాలలో వుంచి అమ్ముతారు.

# సంఘంలో మనుష్యుల ప్రవర్తన: నవ్వు

(సంభాషణ)

నీలం వైదేహి—జంపన కనకదుర్గ

కనకదుర్గ: నేను యిందాకటినుంచి చూస్తున్నా. ఆ అమ్మాయిలు అలా పడి పడి నవ్వుతున్నారే. వారికేం పిచ్చా?

వైదేహి: బహుశా ఏదన్నా చూచి నవ్వుతున్నారేమో.

కనక: ఆ పిచ్చి నవ్వు చూస్తే నవ్వటం అంత యిష్టమైతే, నీవు వెళ్ళి, ఆ అమ్మాయిల్ని కనుక్కో.

వైదే: అలానే వెళ్తా, మరేం చేస్తావిక్కడ? ఏకాకంగా కూర్చుంటావు? బాగా అపహాస్యం లేకుండా ఒళ్ళంతా కంపించేట్టు, పూర్తిగా అనుభవించి నవ్వే నవ్వు ఉదారిగుణాన్ని కలిగిస్తుంది. సాధారణంగా....

కనక: సరేలే. ఏం చెప్పినా వేదాంతం మొదలెడుతావు.

వైదే: ఇది వేదాంతం కాదు. ప్రతిదిన జీవితంలో చూడదగింది. మరి ఒక్కటి అడుగుతాను. చెప్తావా?

కనక: ఏమిటది? అడుగు.

వైదే: నీకు తెనాలి రామలింగని కథలంటే యిష్టమా?

కనక: ఎందుకిష్టం లేదు? అది నిజమో, కాదో కాని.

వైదే: మరి నీవు సినిమాలకెళ్తే కామిడి నటులున్నారో లేదోని చూస్తావా

కనక: అది నిజమే. కామిడీ లేకపోతే చాల సీరియస్‌గా ఉంటుంది సినిమా.

వైదే: అదెందుకంటే, అప్పటికప్పటికి నీలో ఏర్పడిన దుఃఖభావాలను త్రోసిపుచ్చి మనోవికాసం చెందాలని నీవు కోరుతావు. దుఃఖము మనస్సును చిన్నబుచ్చుతుంది. ఏకాంతాన్ని వెదకమంటుంది. ఇతరులంటే అసహ్యం పుట్టిస్తుంది. సంతోషం దీనికి విరుద్ధమైనది, ఇతరులతో కలిసి, సంతోషాన్ని పంచుకోవాలంటుంది. అది ఎటువంటిదైననూ సరే, హాస్యమైనదైనను సరే, ధైర్యస్థైర్యములను కలిగిస్తుంది. వ్యక్తిత్వానికైనను కొంత మనోవికాసం పుట్టిస్తుంది. ఆ సంతోషానికి చిహ్నాలు నవ్వు. దేవుని సృష్టిలో నవ్వగలిగినవాడు మానవుడు ఒక్కడే.

కనక: నీవు చెప్పిందంతా ఒప్పుకుంటాను, కాని దేవుని సృష్టిలో నవ్వ గలిగినవాడు మానవుడొక్కడే అన్నావే, దానితో మాత్రము నేను పూర్తిగా ఏకీభవించలేను. జంతువులుకూడా నవ్వుతాయట, కోతి నవ్వును, ఇకిలించుద్వారా చూపుతుంది. ఇతర జంతువులు తమ నవ్వును తోకాడించి చూపుతాయి. అయితే మానవుడు తన తెలివి ఉపయోగించి సందర్భానుసారంగా నవ్వాలి. కాని చాల మంది ఊసుపోక వెకిలినవ్వు నవ్వుతారు.

వైదే: నిజంగా వారు ఎప్పుడూ సీరియస్ మొహం పెట్టుకొని, ముచ్చులాగా ఉండేవారికంటే నూరురెట్లు మేలనుకో.... మరి సాధారణముగా మనుష్యులు ఎందుకు నవ్వుతారో ఆలోచించావా.

కనక: ఎందుకూ. ఏదైనా తమాషా విషయం వింటే నవ్వుతారు. అదేం చిక్కు ప్రశ్నా?

వైదే: ఏదీ తమాషా విషయం అంటావు? ఉదాహరణంగా?....

కనక: అ....అదెలా చెప్పడం. నేనేం వికటకవినా?

వైదే: పరిహాసం చేస్తున్నావే కాని నీకు ఏదైనా పరిహాసాస్పద విషయం తెలిస్తే నవ్వుతావుకదా. మొన్న మా అన్నయ్య చెప్పాడు. ఒక సైంటిఫిక్ డైజస్టులో చదివినట్టుగా. పరిహాసాన్ని అర్థం చేసుకోవడం ఒక వ్యక్తియొక్క తెలివినిబట్టి వుంటుంది.

కనక: అది నిజమంటావా?

వైదే: కాకపోతే. మనం చిన్నతనంలో దేన్ని చూసి నవ్వాం? సర్కస్‌లో బఫూన్ వికారిమొహంపెట్టి, వికారపు కూతలు కూస్తే పిల్లలు పడిపడి నవ్వుతారు. పెద్దవారు దాన్ని చూసి మందహాసం చేస్తారు, ఎందుకంటావు?

కనక: వారి తెలివి తక్కువైందనేమో?

వైదే: నీ తెలివి ఎక్కువైందంటావిప్పుడు....మరి దానికి నిజమైన కారణం వారి తెలివి ఎక్కువైనందుచేతనే?

కనక: ఎలాగా?

వైదే: చిన్నతనంలో బుద్ధికుశలత తక్కువకాబట్టి నవ్వు కలిగించాలంటే బఫూన్‌నో లేక కామెడియనో అధికంగా శ్రమపడాలి. వికారపు మొహాలు పెట్టాలి, క్రింద పడాలి, పడిన తరువాత దెబ్బతగిలిన దుఃఖము నటించాలి, ఇతరులచే దెబ్బతినాలి....ఇలాగా ఎన్నో మోటుపనులు చేస్తే నవ్వు గలుగుతుంది,

కనక: ఔనులే ఇప్పుడు అట్టి పిచ్చిచేష్టలు చూడాలని బుద్ధిపుట్టదు.... నవ్వలేము కూడా....

వైదే: ఇప్పుడు నీకు నవ్వు రావాలంటే అట్టి పిచ్చిచేష్టలు అక్కరలేదు. జీవితంలోని అపకతవకలను చూస్తేచాలు, నీకు నవ్వు పుట్టుతుంది. ఉదాహరణంగా....చార్లీ చాప్లిన్ ఫిల్మ్ ఒకదాన్నిగూర్చి

చెప్తాను. దాంట్లో అతడు ఒక కార్మికుడుగా నటిస్తాడు. అతని పని ఒక యంత్రాన్ని చేసే పెక్కు దశలలో నొక్కటి మాత్రమే. స్థానమున నుంచబడిన అడ్డు గడియల (బోల్ట్స్) త్రిప్పడమే.... కర్మాగారములో అతడుండు గడియలెల్ల అతనికి వేరుపని లేదు. బోల్టులను త్రిప్పటమే.

కనక : అందేమి నవ్వు గలిగిస్తుంది?

వైదే : అతడు ఆ పనిని ఆ పెద్దకర్మాగారములో గొప్ప సీరియస్‌గా చేయడం, అలసిపోవడం, తప్పులు చేయడం, కర్మాగారంనుండి బయటపడిన తర్వాత కూడ ఏది చేతికందినా అడ్డుగడియలాగ త్రిప్పట మొదలిడటం....

కనక : ఇక చార్లీచాప్లిన్ చేస్తే చాల గమ్మత్తుగానే ఉంటుంది.

వైదే : కాని దాని అంతరార్థము తెలిసికొంటే మన నవ్వు ఇంకా కఠినమౌతుంది.... ఆ చిత్రంలో అతడేమి చూపాడంటే.... యంత్రాలలో పనిచేసే మానవుడు చిన్నచిన్న పనులలో తన మానవత్వమంతా బోపి యంత్రాలవల్లే ఆత్మహీనుడౌతాడని.

కనక : మనల నవ్వించి, మన తప్పుల మనచేతనే గ్రహింపచేయించి, వానిని హాస్యాస్పదం చేయడానికి చూడాడన్నమాట.

వైదే : మన తప్పులు హాస్యాస్పదములే. కాని ఎన్నో కారణాలచేత మన తప్పుల, దురభిప్రాయాల, దుశ్చేష్టల నిజరూపమును గ్రహించక, వానిని మనము ఒప్పులుగా, పరమావధులుగా తలచుకొంటూ వుంటాము.

కనక : వాని నిజస్వభావము తెలిపింపాలంటే, ఒక యుత్తమ మార్గము వానిని హాస్యాస్పదం చేయడం అన్నమాట. ఔనౌను.... ఇప్పుడు జ్ఞప్తికొస్తుంది చార్లెస్ డికెన్సు తన కాలములోని సంఘము నందు అవకతవకల తన నవలలో చిత్రించి, హాస్యాస్పదం చేశాడంటారు.

వైదే : అతని నవలలోని పాత్రలు సంఘంలో దోషము మూర్తీభవించిన వారవుతారు. ఆఫీసులో తనకు గొప్ప అంతస్థు లేకపోయినా, ఆడంబరంగా, అర్భాటంగా ఉండే బంబుల్‌వంటివారు ఎందరు లేరు? ఎందరు ఆశావాదులు రేపేదో ఐశ్వర్యము రాగలదని దుస్థితిలో గూడ సంతోషవంతులైన మికాబరువంటివారులేరు.

కనక : అక్షరాల నిజం.... మన దేశంలో వీరేశలింగం పంతులుగూడ మన సంఘపు అవకతవకలను ప్రహసనాలలో నవ్వుపుట్టేటట్టు వ్రాశారు గదా.... నిజంగా నవ్వు చాల బలవత్తరమైన ఆయుధంగూడ కాగలదన్నమాట.

వైదే : కావలిస్తే ఒక్కసారి ఆలోచించి చూడు. కృష్ణదేవరాయలు ఎంతటివాడు.... ఆ కాలపు రాజులంటే ఎంత అధికారముండేది? అట్టి వారికికూడ ఎన్నిసార్లు తెనాలి రామలింగం నవ్వుకలిగించి తప్పులను గ్రహింపచేసేవాడు!

కనక : ఆ.... ఇంద్రుని సభలో హాహా, హూహూ... అనే హాస్యగాళ్ల మహేశ్వరుని సభలో భృంగిరిటి, అక్బరు చక్రవర్తి కొలువు కూటంలో బీర్బల్. ఇలాంటి తెగకు చెందినవారిన్నమాట. నవ్వు చేత ఏదైనా చెప్పి చూపితే దానివలన క్రోధము పుట్టదు.... మంచి మనస్సుతోనే తమతమ తప్పులు మనుష్యులు సవరించుకొంటారన్నమాట.

వైదే : ఆ నవ్వుచేత మహాకార్యం సాధించిన వారలలో వాల్టేరొకడు. ఫ్రెంచి గ్రంథకర్త. అతడు తన కాలపు సంఘములోని మూఢ నమ్మకాలను ఛేదించటానికి నవ్వును ఆయుధముగా గైకొన్నాడు. గొప్ప కార్యాన్ని సాధించి నేను మూఢనమ్మకాల నిప్పుడు త్రోసిపుచ్చితి అన్నాడు.

కనక : నిజమే. చాలసార్లు ఒకడు తప్పులుచేస్తే మనవారికి వాటినిగురించి చెబితే, నీవెవ్వరు నాకు చెప్పడానికని మూర్ఖత్వం మీద ఇంకా గట్టిగా ఆ తప్పులే చేస్తారు. సంఘములో యిది చాల సామాన్యం గదా. అదే వానిని నగుబాటుచేస్తే, సిగ్గుపడి వానిని వారే వదులుకుంటారు.

వైదే : ఔను. ఇప్పుడు మన సంఘములోవుండు అవకతవకలు, మూఢనమ్మకాలు, పనికిమాలిన భేదాలు—అవి ఎంత ప్రాచీనమైతే నేమి—నగుబాటు వేయడానికి ఒక వాల్టేరుంటే ఎంత బాగుండును.

కనక : ఔనౌను. ఇదిగో ఇంత మనం మాట్లాడుకునేసరికి ఆ అమ్మాయిలు ఇంకా నవ్వుతుంటూనే యున్నారు.

వైదే : అదీ మంచిదే.... సంతోషం సగం బలం కదా.

# జీవిత విజయ సాధనలు: లేఖలు

వనం దురాకుమారి

ప్రతిరోజూ సాయంత్రం కాలేజీ నుంచి రాగానే అమ్మను నేను ప్రశ్నించేదేమంటే "కల్పవృక్షం" వచ్చాడా? ఆ మాట విని పక్కింటి వాళ్లు నవ్వుకుంటారు నిజంగా నాకే కాదు, చాలా మందికి పోస్టుమేన్ అంటే సరిగ్గా కల్పవృక్షం లాంటివాడే. అతనికోసం ఆత్మీయులకోసం ఎదురు చూచినటుగా అలా నిరీక్షించడం. తీరా అతడు వీధిలోకి వచ్చి మన యింటి ముందుకు వచ్చేలోగా గుండె మరింత వేగంగా కొట్టుకోవడం, అయ్యో మన యింటికి వస్తాడో రాడో అని—ఇంతాచేసి మన యింటిముందు నుంచే అతడు ఆగకుండా వెళ్ళిపోవడమే గనక తటస్థిస్తే మరి చూడాలి మన అవస్థ అబ్బా, మర్నాడు మళ్ళీ అదే నిరీక్షణ.

కొందరికి ఉత్తరాలు అందుకోవడం యిష్టమేగాని, జవాబులు వ్రాయడం మాత్రం బద్ధకం. "ఎప్పుడూ ఏముంటాయమ్మా ఆ ఉత్తరాల్లో అలా ప్రాకులాడుతారుగాని...." అంటారు కొందరు.

### రకరకాలు

నిజంగా ఎన్నో విశేషాలని మోసుకొస్తాయి జాబులు. బాధతో కృశించి నలిగిపోయిన హృదయాలను సేద తీర్చేవి కొన్ని వేదనలో ఉన్న మనుష్యులకు ఊరటను చేకూర్చేవి కొన్ని, భగ్నహృదయాలకు కర్పూరం ముక్కల్లాంటి చల్లని పలుకులను ఆదరపూర్వకంగా అందించేవి మరికొన్ని జీవితాలను తలక్రిందులే చేయగలిగినవీ ఒకటేమిటి—అధికారులమధ్య నడిచేవి ఆత్మీయులమధ్య జరిగినవీ—ఆకాశరామన్నలు వ్రాసేవీ—ఇలా ఎన్నెన్నో రకాలుంటాయి.

చక్కగా మాట్లాడడం, నలుగురితో పరిచయం చేసుకోవటం. ఉపన్యాసాలీయగలగడము యిలాంటి వాటికిమల్లేనే చక్కని ఉత్తరం వ్రాయగలగటమూ ఒక కళే. సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం లాంటి లలిత కళలు కాకపోయినా చతుష్షష్టికళలూ ఉన్నట్లే నేర్పుగా లోకంలో వ్యవహరించటం, పదిమందిలో మసులుతూ, ఎవరినీ నొప్పించకుండా చాకచక్యంగా మన అవసరాలు తీర్చుకుంటూ అన్నీ సమర్థించుకుని ఎవరిచేతా మాటపడకుండా పదిమందిలోనూ బొననిపించుకని రావటమన్నది నిజంగా విశేషమే. అని చేతకానివాళ్ళు జీవితంలో దేన్నీ సాధించలేరు పెద్దగా లలితకళలలో మనకు ప్రావీణ్యతగానీ, ప్రవేశంగానీ లేకపోయినా యిబ్బంది లేదుగానీ, యీ చిన్నచిన్నవాట్లలో గనక మనము సమర్థులం కాకపోతే మనకు జీవనయాత్ర కొంత కష్టమే అవుతుంది.

### ఉత్తరాలే శరణ్యం

అత్తవారింటికి వెళ్ళిన అమ్మాయి దగ్గరనుంచి వచ్చే ఆ కార్డుముక్క కోసం అమ్మా, నాన్నా ఆతురతతో, అహర్నిశలూ ఎదురు చూస్తూ ఉంటారు. అది తెచ్చేది క్షేమసమాచారాలు నాలుగు ముక్కలే అయినా ఆ తలిదండ్రుల హృదయాలను ఆనందంలో తేల్చివేయగలదు. అదే పదిరోజులు ఆలస్యంగా వస్తే వారి గుండెలు తల్లడిల్లిపోతాయి దూరదేశంలో ఉన్న భర్త సంగతులుగానీ కాని దేశాల్లో వున్న కొడుకు సంగతులుగానీ తెలుసుకోవాలంటే మరి ఉత్తరాలే గదా శరణ్యము!

అందరికి అలవడని చిత్రమైనకళ

కొందరికేమిటో అసలు ఉత్తరం వ్రాయటమే చేతకాదు సరిగదా పైగా విసుగూ చిరాకూగూడా. వాళ్ళకి చదవటమన్నా బాధే, వ్రాయటమన్నా బాధే. కాని అసలైన లేఖలు అందుకునే వారికి ఎంతటి ఆనందాన్ని కలిగించిందో అంతటి ఆనందం వ్రాసేవారికీ అంతటి ఆనందం రసం పదార్థం కాబట్టి నాదే పదకాలం దాన్నే కలిగిస్తాయి. అలాంటి లేఖలు రచించగల్గటమే కళ అనిపిస్తుంది, అది అందరికీ అలవడని చిత్రమైన కళ

లిఖితరూపంలో మరొకరికి పంపే సందేశాన్నే లేఖ అంటారు అసలు లేఖా రచనలో మనం గమనించవలసిన ముఖ్యమైన విషయాలు ఎన్నో ఉన్నాయి ప్రధానమైనది భాష ఆ భావమే రసాన్నిబట్టి ఉత్పన్నమవుతుంది రసమంటే నవరసాల్లో సందర్భాన్నిబట్టి, ఆ లేఖలు జరిగే వ్యక్తులమధ్యగల సంబంధాన్నిబట్టి నిర్ణయింపబడుతూంది. అలాగే ఒక లేఖలో సందర్భాన్నిసరించి పలు రసముల సమ్మేళనమూ అవసరమే అవుతుంది, వ్యక్తులు పరస్పరమూ తమ మనోభావాలను వెల్లడించుకొనే సాధనమేగదా భాష! అది రసాన్ని భావాన్నీ ఆశ్రయించే ఉంటుంది, అలా కానప్పుడు రసోచిత కాని భాష ఆమోదయోగ్యమూ కాదు, అహ్లాదజనకమూ కాదు. ఉదాహరణకు ప్రేమికుల మధ్యగానీ, నూతన దంపతుల మధ్యగానీ ఓ లేఖ వ్రాయబడితే ధమ అంతలి విషయములు శృంగార

లలితంగా మధురంగా, సున్నితంగా ఉండాలిగానీ, గంభీరంగా కటువైన పదాల సమ్మేళనంతో, ఏ యుద్ధరంగాన్నో వర్ణిస్తున్నట్లుగా ఉంటే అది సరసమైన లేఖ అనిపించుకోదు. అంతేకాదు, భాషలో మనం గమనించవలసింది, ముఖ్యమైనది మరొకటుంది. లేఖ మొదటినుంచి చివరివరకూ సరళముగా ఒకే రకమైన భాషలో ఒకే రకమైన శైలిలో ధారాళంగా సాగిపోగలగాలి.

### పదాల పొందిక

ముందే చెప్పానుగా, మనం ఎవరికైతే రాస్తున్నామో ఆ వ్యక్తులకూ మనకూ గల సంబంధాన్నిబట్టి భావం, పదాల పొందిక, భాషాకూడా ఎన్నుకోవాలని. తల్లిదండ్రులకు రాసే ఉత్తరాలలో గౌరవ ప్రేమలతో పాటు కొంచెం చనువూ వుంటుంది. తనకంటే చిన్నవారైన తమ్ముళ్లకీ చెల్లెళ్ళకీ రాస్తే, అందులో వాత్సల్యం అధికంగా వుంటుంది. పూజ్యులైన గురువులకీ పెద్దలకీ రాసేదాట్లో కేవలం గౌరవం, భక్తిప్రపత్తులు ఉట్టిపడుతూ వుంటాయి. దంపతుల మధ్య అనురాగ ప్రదర్శనం, శృంగార భావాలకే ఎక్కువ అవసరం వుంటుంది. ఇలా వివిధ రసాలకూ అనుగుణ్యమైన పదజాలాన్నే మనం ఎన్నుకుంటాము. లేకపోతే అసహజంగా వుండి, రసాభాస అవుతుంది. మొన్న మా తాతగారికి ఓ యువ [illegible] ఉత్తరం వ్రాశాడు.

"చి॥ సౌ॥ మా అమ్మగారు మా నాన్నగారి అబ్దికానికి వారంరోజుల ముందే మరణించారు" అంటూ, అది విని మేమంతా విరగబడి నవ్వుకున్నాము. రాసిన ఒక్క వాక్యంలో మా ఎన్ని అసందర్భాలున్నాయో మా తండ్రి— అసలు ఒక్కొక్క వయసు వారిని సంబోధించటానికి ఒక్కో పద్ధతి వుంటుంది. ఒక్కొక్క రకం లేఖ ముగించే పద్ధతి వేరు. చిన్న వాళ్ళకు రాసే జాబులో గ్రహించవలెను అని రాస్తారు. పెద్దలకు రాసే వాటిలో చిత్తగించవలెను, అంటారు ముగింపులో. ఉత్తరంపైన శుభం అనో, క్షేమం అనో రాయటం మన అందరికీ అనుభవంలోని సంగతే. అది రాయని జాబు అశుభాన్ని మోసుకువస్తుందని యిట్టే తెలుస్తుంది. వెనుకటికి ఎవరో వ్యంగ్యంగా అన్నారు ఒక స్త్రీ రాసిన లేఖలో ముఖ్యమైన విషయాలు ఎప్పుడూ ఉత్తరం ముగించిన తరువాత ఆఖరులో రాసే పోస్ట్ స్క్రిప్టులో వుంటాయని. అంటే లేఖనిండా అనవసరమైన సంగతులు నింపి అసలైనవి మర్చిపోతారని వారి భావం.

## అక్షర రమ్యత

మరొక ముఖ్యమైన అంశం అక్షర రమ్యత. అదే అక్షరాల పొందిక. కొందరి దస్తూరీ గుండ్రంగా ముత్యాల కోవలా చూడ ముచ్చటగా వుంటుంది. చక్కని దస్తూరీ వుండటమూ అదృష్టమే. ఎంతమంచి భావాలతో మధురమైన లేఖ వ్రాసినా దస్తూరి బాగుండకపోతే చివరంటా మనము తగినంత సహనంతో చదవలేము. డాక్టర్లు రాసే జిలుగు దస్తూరీగురించిన తమాషాలు మనం వింటూనే వుంటాము. ఒక డాక్టరుగారు భార్యామణికి జాబు రాస్తే దాన్ని ఆవిడ మందుల షాపుకి వెళ్ళి చదివించుకోవలసి వచ్చిందట. అలా మనము రాసే వుత్తరంలో సగం అర్థం కాకుండా చదివే వాళ్లు విసుగెత్తి అవతల పారేసేలా వుండకూడదు. ఎన్ని పేజీలు రాసినా దాన్ని అందుకుని చదివే వ్యక్తికి అలసట, విసుగుదల లేకుండా ప్రతి పంక్తిలోనూ ఉత్సాహాన్ని పొందేలా వుండాలి. అందుకు కేవలం అక్షరాలు అందంగా వుంటే చాలదు. అవి సరిగా అర్థం అవాలి కూడా. ఒక అక్షరం మరో అక్షరంలా కనిపించిందంటే అర్థమే తారుమారు అవుతుంది సరికదా కొన్ని సందర్భాలలో చాలా అనర్థాలు కూడా సంప్రాప్తమవుతాయి. విషము నిమ్మ అన్న మాట రాస్తే, విషయ నిమ్మ అని దిద్దేసరికి కథ ఎలామారిందో చంద్రహాస చరిత్ర తెలుపుతుంది.

## నిజంగా కళ

కొన్ని రకాల జాబులు వ్రాయటములో ఎంతో లౌక్యం, నేర్పు కావాలి. పదాలు గడుసుగా ఎన్నుకొని రాయవలసి వుంటుంది. రాసేవారికి అందుకునేవారికీ దాని నిజమైన భావం గోచరించి, అన్యులకు సాధారణ మనిపించేలా రాయవలసిన పరిస్థితులూ వుంటాయి. ఇవన్నీ రాజకీయమైన లేఖలకు వర్తిస్తాయి. అత్తవారింటి నుండి అమ్మాయి రాసే జాబులూ అలా ధ్వనిగర్భితంగానే వుండాలి. కొన్నిసంసారాల్లో కోడళ్ళు వుత్తరాలు రాయగూడదనే ఆంక్షలుంటాయి కదా. రాసినా వాటిని నఖశిఖపర్యంతం శల్య పరీక్ష చేసినమీదటనే పోస్టులో వేసారు. అలాంటప్పుడు జాగ్రత్తగా రాయకపోతే కోరి ప్రమాదాల్లో యిరుక్కోవలసి వస్తుంది ఇంటి కోడలు. అందుకే వెనకటికి ఒక ఇల్లాలు, తండ్రి "అత్తింటి సుఖం ఎలా వుందీ తల్లీ" అంటే— "మోకేతి దెబ్బలా వుంది నాన్నా" అని అన్నదట.

అలా ఉపమానాలతో గుంభనగా వెంటనే ఎదుటివాళ్ళకు అంతర్లీనమైన భావము అంతుపట్టని విధంగా వుత్తరాలు రాయటం సమర్థించుకోటం నిజంగా కళే.

## జీవిత విశేషాలు

ఆ మాటకు వస్తే ఏది కళగాదు? జీవించటమే ఒక కళ. మిగిలిన కళలన్నీ అది జయప్రదంగా, సుఖప్రదంగా సాగటానికి అనువైన సాంగులు. తను హాయిగా బ్రతుకుతూ తన చుట్టూతా వున్నవారి బ్రతుకులు కూడా కాంతివంతంగా చేస్తూ, తనకు వున్నది నలుగురికీ పంచిపెడుతూ జీవితంలో సుఖపడగలగటానికీ యివన్నీ సహకరిస్తాయి.

ప్రతివ్యక్తీ జీవితంలో ఏదో సందర్భాలలో ఏవో లేఖలు రాయవలసిందే. కొందరు గొప్పవారి జీవిత విశేషాలు వారు యితరులకు రాసిన లేఖలనుండే గ్రహిస్తారు. గాంధీజీ, రవీంద్రుడు, వివేకానందుడు, మీరా బెన్ మొదలైన వారి లేఖలవల్ల మనము ఎన్నో విశేషాలు గ్రహించగలుగుతున్నాము. నెహ్రూజీ ఇందిరకు రాసిన లేఖలూ అలాంటివేకదా. అటు ఆంగ్ల సాహిత్యంలో గడుసుగా రచనలు చేయటంలో శర్వరి అయిన శామ్యూల్ జాన్సన్, లార్డ్ చెస్టర్ ఫీల్డుకు రాసిన లేఖ మచ్చుతునక అన్న విషయం జగద్విదితం. ఇలా చెప్పేకొద్దీ ఎంతయినా వుంది.

ముచ్చటగా క్లుప్తంగా చెప్పుకోవాలంటే, మంచి లేఖ రాయటానికి భావము, భాష, రసము, అక్షర రమ్యత ప్రధానమైనవి అని జ్ఞప్తియందుంచుకుంటే చాలు. అప్పుడు మనమూ చక్కని లేఖలు సందర్భశుద్ధిగా రాయగలము.






## అఖిల భారత కదంబ కార్యక్రమము

మార్చి 16-వ తేదీ శుక్రవారం నుండి మార్చి 31-వ తేదీ శనివారం వరకు

(మార్చి 18, 25 ఆదివారములు మినహా)

ఉ॥ **ప్రసారము I**

42·13 మీ (7120 కిలోసై)
41·32 మీ (7260 కిలోసై)

7-00 అరుణోదయ సంగీత ఝుంకారం
7-30 వందనవార్ భక్తి గీతావళి
8-00 ఝుంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్‌సంగమ్ కదంబ కార్యక్రమము
8-30 మధువన్
8-57 ఝరోకా నేటి కార్యక్రమముల వివరణ
9-00 ప్రసార సమాప్తి

మ॥ **ప్రసారము II**

25·27 మీ (11870) కిలోసై
31·28 మీ (9590) కిలోసై

11-00 ఇంద్రధనుస్సు కదంబ కార్యక్రమము
12-00 ప్రసార సమాప్తి

మ॥ **ప్రసారము III**

25·36 మీ (11830 కిలోసై)
31·28 మీ (9590 కిలోసై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 ప్రసార సమాప్తి

సా॥ **ప్రసారము IV**

31·41 మీ (9550) కిలోసై

కర్ణాటక సంగీత కార్యక్రమము

4-30 గీతమాలిక
4-45 అంజలి-గీతాలు
5-00 వాద్య సంగీతం
5-15 మధుర గీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 జ్ఞానామృత్ శాస్త్రీయ సంగీతం
6-15 ప్రసార సమాప్తి

రా॥ **ప్రసారము V**

31·41 మీ (9550 కిలోసై)
41·32 మీ (7260 కిలోసై)

6-30 హార్‌హార్ ప్రసిద్ధ పురాతన గీతాలు
6-45 ఉదయగాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావళి మీరుమెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
8-10 రసవంతి సుగమ సంగీతం మీరుకోరినవి (బుధవారములు)
8-30 మన్-చాహే గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోకా రేపటి కార్యక్రమముల వివరణ (శనివారములు మినహా)
9-45 ప్రసార సమాప్తి

**ప్రత్యేక కార్యక్రమము**

మార్చి 17, 24, 31 శనివారములు

రా॥ 9-45 నుండి 11-00 వరకు
50·38 మీ (5955 కిలోసై)
10-00 నుండి 11-00 వరకు
41·32 మీ (7260 కిలోసై)

9-45 నాదరంజని వాద్య సంగీతం
10-00 గీతమంజరి లలిత సంగీతం
10-40 రంగవాణి లలిత శాస్త్రీయ సంగీతం
10-57 ఝరోకా వచ్చేవారపు కార్యక్రమాల వివరాలు
11-00 ప్రసార సమాప్తి

మార్చి 18, 25 ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

ఉ॥ **ప్రసారము I**

42·13 మీ (7120 కిలోసై)
41·32 మీ (7260 కిలోసై)

7-00 అరుణోదయ సంగీత ఝుంకారం
7-30 వందనవార్ భక్తిగీతాలు
8-00 ఝుంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్ సంగమ్ కదంబ కార్యక్రమము
8-30 గీతోంభరి కహని పాటలతో కూర్చిన కథ
8-57 ఝరోకా నేటి కార్యక్రమముల వివరణ
9-00 ప్రసార సమాప్తి

**ప్రసారము II**

25·27 మీ (11870 కిలోసై)
31·28 మీ (9590 కిలోసై)

10-15 రంజావళి,
10-45 రత్నాకర్ నాటికలు, హాస్యరచనలు, కథలు
11-00 బాగ్‌బహార్
11-30 చౌపల్ మీరుకోరిన పాటలు
12-00 ప్రసార సమాప్తి

మ॥ **ప్రసారము III**

25·36 మీ (11830 కిలోసై)
31·28 మీ (9590 కిలోసై)

2-00 మనోరంజని మీరుకోరిన పాటలు
3-00 అప్నాఘర్ 'పిల్లలతో' అంగడిలో
3-30 ప్రసార సమాప్తి

సా॥ **ప్రసారము IV**

31·41 మీ (9590 కిలోసై)

కర్ణాటక సంగీత కార్యక్రమము

4-30 గీతమాలిక
4-45 అంజలి-గీతాలు
5-00 వాద్య సంగీత
5-15 మధురగీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 జ్ఞానామృత్ శాస్త్రీయ సంగీతం
6-15 ప్రసార సమాప్తి

సా॥ **ప్రసారము V**

31·41 మీ (9550 కిలోసై)
41·32 మీ (7260 కిలోసై)

6-30 హార్‌హార్ ప్రసిద్ధ పురాతన గీతాలు
6-45 ఉదయగాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావళి మీరుమెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
8-10 రసవంతి సుగమ సంగీతం
8-30 మన్-చాహే-గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోకా రేపటి కార్యక్రమముల వివరణ
9-45 ప్రసార సమాప్తి

అన్ని వివరములకు : ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్టుబాక్స్ 4, బొంబాయి-1.

VANI—Printed at the Royal Printing Works, Madras-2—Edited and Published by the Station Director, All India Radio, Madras-4.



ముజహిద్ అలీ అన్సారీ; సంగీత రచన
జానపద సంగీత కార్యక్రమము
(హైదరాబాద్, మార్చి 16)



'మార్కండేయ చరిత్రం' మేలటూర్ నృత్య సంగీత నాటికలో
పాల్గొన్నవారు (విజయవాడ, మార్చి 16)



ఎ. పి. క్రాస్;
'This week in Madras' లో ప్రసం



ఖంకోసం' నాటికలో పాల్గొన్న ఆంధ్ర జాతీయ కళాశాల బృందము
(ఇటీవల విజయవాడనుండి ప్రసారితము)



బందరు హిందూ కళాశాల బృందగానం
(విజయవాడనుండి ప్రసారితము)



ద్వారం వెంకటస్వామి నాయుడు [మార్చి 17]
(అఖిల భారత సంగీత కార్యక్రమము)



సిద్ధేశ్వరీ [మార్చి 24]



ఆర్. దుర్గాంబ; హరికథా కాలక్షేపం
(విజయవాడ కేంద్రం నుండి ప్రసారము)